# ఆంధ్రుల-చరిత్ర

డాక్టర్ నేలటూరి
వేంకటరమణయ్య ఎం. ఏ. పి. హెచ్. డి.

: ప్రచురణ :
ఆంధ్రసారస్వత పరిషత్తు, హైద్రాబాదు.



డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్యగారు ఎం. ఏ. పి. హెచ్. డి.

# మున్నుడి

ఈ సంవత్సరము ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షమున చరిత్ర, సాహిత్యము, విద్య, విజ్ఞానము అను విషయాలను గురించి విజ్ఞాన దాయకములగు ఉపన్యాసములను ఇప్పించుటకు నిశ్చయించినాము. ఆ ఉపన్యాస పరంపరలో చరిత్రను గురించి సుప్రసిద్ధ పరిశోధకులగు డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు ఎం. ఏ. పి. హెచ్. డి. ఆంధ్రుల చరిత్ర అను విషయములను గురించి పరిషత్తు ప్రార్థించగా అంగీకరించి రెండు ఉపన్యాసములను రెడ్డి విద్యార్థి వసతి గృహమున అగస్టు ౩౦ సెప్టెంబరు ౧ తేదులలో ఒసగి యుండిరి. ఆంధ్ర పాఠకలోకమునకు వీటిలోని అమూల్యాంశములను తెలియజేయు ఉద్దేశముతో వీనిని ప్రకటించుచున్నాము. దయతో ఉపన్యాసములను ఇచ్చుటకు అంగీకరించి వానిని పుస్తకరూపముగా ప్రకటించుటకు సమ్మతించిన శ్రీ డాక్టరు వెంకటరమణయ్యగారికి ధన్యవాదములు. శ్రీ డాక్టరు వెంకటరమణయ్యగారి ఈ ఉపన్యాస సభలలో నొకదానికి అధ్యక్షత వహించి నిజాంకాలేజి చరిత్ర అధ్యాపకులగు శ్రీ శిరుగూరి హనుమంతరావు ఎం. ఏ. ఎల్. టి. అధ్యక్ష అభిభాషణమును ఈ పుస్తకమునకు ఉపోద్ఘాతముగా ప్రకటించుచున్నాము. వారికి కూడా మా కృతజ్ఞతాభివందనములు.

ఆంధ్ర సారస్వతపరిషత్తు
హైదరాబాదు
తేది: 31-10-1950

పులిజాల హనుమంతరావు
కార్యదర్శి

# ఉపోద్ఘాతము

సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులగు శ్రీ వెంకటరమణయ్యగారి రెండవ ఉపన్యాసమునకు అధ్యక్షత వహించమని నన్ను కోరినందులకు పరిషత్తు కార్యనిర్వాహకులకు కృతజ్ఞతాభివందనములు. సుమారు 20 సంవత్సరములనుండి చరిత్ర పరిశోధనయందు, యేకాగ్రతతో కృషి చేసి, మదరాసు విశ్వవిద్యాలయ చారిత్ర పరిశోధనశాఖకు కీర్తి తెచ్చినవారిలో రమణయ్యగారొకరు. 1914 వ సంవత్సరమునకు పూర్వము, యూనివర్సిటీ విద్యలలో పరిశోధనకు తగినఅవకాశములు ఉండలేదు. ఆతరువాత, సుప్రసిద్ధపండితులు పరిశోధకులగు కీర్తి శేషులైన కృష్ణస్వామి అయ్యంగారువారు, విజయనగర చరిత్రపరిశోధనకు పునాదివేసి, Epigraphic department లో పనిచేసిన శ్రీ వెంకయ్య, కృష్ణశాస్త్రిలవారి పరిశోధనలను, పరిశోధకులకు, విద్యార్థులకును ఉపయోగకరముగా నుండునట్లుల చేసిరి. 1928 వ సంవత్సరమునందు, విజయనగరచరిత్రను,| B A. Honors M A విద్యార్థులు పఠించు విషయములలో నొకటిగా యేర్పాటు చేసినప్పుడు, శ్రీ వెంకటరమణయ్యగారు మదరాసు క్రిస్టియన్ కాలేజిలో చరిత్రోపన్యాసకులుగా నుండి, విజయనగర చరిత్రను దు పరిశోధన చేసి, వారి పరిశోధనాసామర్థ్యము వలన, మదరాసు విశ్వవిద్యాలయమునందు, Reader in Indian History and Archaelogy పదవిని సంపాదించిరి. సుమారు 20 సం॥లు. వారి కాలమంతయు పరిశోధనయందు వినియోగించుటకు అవకాశము కలిగినది. పరిశోధన చేయు పండితులకు మదరాసు విశ్వవిద్యాలయమందు, Intermediate, B. A. తరగతులకు పాఠముచెప్పవలసిన అవసరములేదు, B. A. (Hons) M. A తరగతులకు కూడ, వారిష్టము వచ్చినపుడు వారు పరిశోధన చేయు విషయములనుగురించి, సంవత్సరము

నకు 10, 12 ఉపన్యాసములు ఇచ్చినచాలును. పరిశోధనకు ఇంటర్, బి. ఏ. పాఠములకు సంబంధములేదు. మన విశ్వవిద్యాలయమందు, తగిన చరిత్రపరిశోధన జరగవలెనన్న, పరిశోధకపండితులను, దినము నకు మూడుగంటలుపన్యాసకులుగ నుంచవలెనని కోరవలెను.

శ్రీ వేంకటరమణయ్యగారు 1933 వ సంవత్సరము, మద్రాసు విశ్వ విద్యాలయ సహాయ మునుపొంది విజయనగర మునుగూర్చి Origin of the city and Empire అను పుస్తకము ను ప్రచురించిరి. రెండుసంవత్సర ములతరువాత Stories in the history ofthe third dynasty of Vijaya nagara అనుగ్రంథమును ప్రచురించిరి. తరువాత కన్నడ మరియు విజయ నగరఅను చిన్నపుస్తకమువ్రాసెను. మహమ్మదీయ ఆధారములను మిక్కిలి శ్రమలో పరిశీలించి, Epegraphic depth లో శ్రీ కృష్ణమాచార్యులగారి సహాయ అనేకవిషయములందు తీసికొని, శాసనపరిశ్రమను, భాషా జ్ఞానమును, కనుపరచి, మన మునిస్సించు తెలింగా నా ప్రాంతమునందు ప్రాచీనచరిత్రము విపులముగా పరిశీలించి 1939 వ సం వత్సరమందు వెలుగోటివారి వంశావళియను గ్రంథమునకు విలువైన పీఠికయు 1942 వ సంవత్సరమునందు కాకతీయ ప్రతాప రుద్రుని కాలముగురించి. muslim expansion in South Inida అను పుస్తకమును, ప్రచురించిరి. వారు మద్రాసు యూనివర్సిటీ ఉద్యోగమువదలి రెండుసంవత్సరములు కావచ్చుచున్నది. కొద్దికాలము క్రిందటనే, Further sources of Vijayanagar History అను మూడు సంచికల పుస్తకములో వారు మద్రాసు విశ్వవిద్యాలయమునకు చేసిన సేవముగిసినది. మొదటిసంచిక సంక్షిప్తముగా విజయనగర చరిత్ర రెండవసంచిక మనభాషలో శాసనముల సంపుటము. మూడవసంచిక యందు ఈ శాసనములు ఆంగ్లములో భాషాంతరీకరణము చేయబడినవి.

శ్రీ వెంకటరమణయ్యగారి వయస్సు 57 సం॥లు. ఆంగ్ల విశ్వ విద్యాలయములందు 65, 70 సం॥ల వరకు పరిశోధకులు నూతనవిషయ ములను కనుగొని విజ్ఞానాభివృద్ధికితోడ్పడుచున్నారు. డాక్టర్ వెంకటరమ ణయ్యగారు ఆంధ్రచారిత్రక విజ్ఞానమునకు సహాయముచేయుటకు తగిన

వారు. భాషాజ్ఞానము, శాస్త్రజ్ఞానము. పాశ్చాత్య పరిశోధకవిధానముల జ్ఞానము కలిగియున్నవారు. ఉస్మానియా విశ్వవిద్యాలయములోనేమి, హిందూ మహమ్మదీయ హైదరాబాదువాస్తవ్యులగు ధనవంతుల పుస్తకభాండాగారములలో నేమి, అమూల్యమైన సంస్కృత, ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర నాగరికతను వెల్లడిజేయు ఆధారము లనేకములు గలవు. తమ పరిశోధకులు లెక్కువ. పరిశోధనకు కావలసిన ప్రోత్సాహము, అన్యోన్య అభిప్రాయభేదములు లున్నప్పుడు ఉండవలసిన సహనముతక్కువ. మనవారందరిమూ శ్రీ రమణయ్యగారు ఇక్కడకువచ్చి పరిశోధనవిషయమందు ప్రోత్సాహము కలుగ చేసినందులకు వారికి మనవందనములు.

| | |
|---|---|
| హైదరాబాదు<br>తేది: 31-10-50 | **శ్రీసిరుగారి హనుమంతరావు M. A. L T.**<br>నిజాంకాలేజి చరిత్ర అధ్యాపకులు |

[ శ్రీ విజయనగర సామ్రాజ్యమందును, దక్షిణదేశమందును, ప్రసిద్ధిజెందిన త్రిమతాచార్యులవారి విఖ్యాతి గౌరవముకలిగెను. మొదటి విజయనగర వంశము వారు విద్యారణ్యులవారికిని కృష్ణదేవరాయలువారు శ్రీ వ్యాసరాయలువారికిని ఆరవీటివారు శ్రీ రామానుజులు వంశపువారికిని ఆదరము చూపిరి. ]

---

# భారతదేశ చరిత్ర — ఆంధ్రులు

ఆంధ్రసారస్వత పరిషత్తువారు నన్నిచ్చటకు ఉపన్యసించుటకు రప్పించి కరము గౌరవించినారు. వారినొక ప్రశ్నడిగెదను. ఇది చరిత్రనాల్లనియుగము. ఇప్పటివారికి పూర్వ వృత్తాంతముతో పనిలేదు. వారి దృష్టి భౌతిక రసాయనాది శాస్త్రములందు లగ్నమైయున్నది. ఉద్యోగ విపణియందు దానికిగల విలువ చరిత్రకు లేదు. కేవలము దేశీయార్థికాభివృద్ధిని పరమావధిగా దలంచు ప్రభుత్వాధిపతులు అట్టి అభివృద్ధికి దోడ్పడు భౌతికాది ప్రకృతి శాస్త్రములయెడ వలపక్షము జూపుట యబ్బురపాటుకాదు. మరియుయుద్ధమారణకర్మకు అవియుపయుక్తములైనట్లు చరిత్ర కాజాలదు. స్వాధికార సంస్థాపనకొఱకు ప్రపంచ శాంతికి భంగమును కలిగించి, యుద్ధప్రయత్నములెడతెగక సేయుచుండు రాజ్యములును వ్యాపారసంస్థలును యెల్లెడలను త్రవ్వితండములుగ గలవు. వారెప్పుడును నూతన మారణోపకరణ నిర్మాణమునకు దారులు వెదుకుచుండును, క్రొత్త క్రొత్త రకపు విమానములను, యంత్రనిర్మితాగ్నేయాస్త్రసంచయమును అటం హైడ్రోజనాది బాంబులను ఉత్పత్తిగావించి తన్మూలమునతమ యధిరాజ్యములను స్థాపించుటకు నానాదేశపాలకులును ఇప్పుడిట్లుపాటుపడుచుండుటయు మీరెఱుంగని యంశముగాదు. వాంఛిత ఫలసిద్ధిపొందుటకు వీరికందరికిని భౌతికరసాయనికాది శాస్త్రవిచక్షణుల సహాయమత్యంతావశ్యకము. కావున వారికెల్లయెడలను ఆశ్రయము సుసాధ్యమగుచున్నది. చరిత్రకారులకు ఆశ్రయము రానురాను శశవిషాణమగుచున్నది. యీకారణమున, చరిత్ర పఠన మెవ్వరికిని రుచింపక పోవుచున్నది. జీవనమునకుపకరింపని చదువు అ[illegible]సిగాచిన

వెన్నెలగదా! చరిత్రపఠనమున నాస్తికమునకుగల యనాదరము మన విశ్వవిద్యాలయములందు ప్రతిఫలించుచున్నది. ప్రకృతి శాస్త్రము నభ్యసించు విద్యార్థులసంఖ్యతో చరిత్రాధ్యాపక విద్యార్థుల సంఖ్యను బోల్చి చూచితిరేని మీకీవిషయము తెల్లముకాఁగలదు. ఈపరిస్థితులందు ఆంధ్రవాఙ్మయ పరిషత్తువంటి సంస్థ చారిత్రక సాంస్కృతిక విషయములయందు అభిమానముంచి చరిత్ర పరిశోధకులను రచయితలను ప్రోత్సహింప దొరకొనుట కడు ప్రశంసనీయము. కావున వారిని చారిత్రకులపక్షమునను సాంస్కృతిక విషయ సంశోధకుల పక్షమునను ఆంధ్రవాఙ్మయ పక్షమునను వందించుచున్నాను.

'భారతదేశ చరిత్ర-ఆంధ్రులు' అను విషయమై నన్ను ఉపన్యసింపుమని పరిషత్తువారి యాదేశము. భారతీయ సంస్కృతియందు ఆంధ్రులెంతవఱకు గారణభూతులు? అని ప్రశ్నించుచు నేననుసంధానము గావించుకొంటిని; తదనుగుణముగా ప్రస్తుతముపన్యసింపదలపెట్టినాడను. చెప్పదగినవిషయము బహుళము; చక్కఁగా వివరింపవలయునన్న ఒక పెద్ద గ్రంథము వ్రాయవలసి యుండును. దానినంతయు వివరించుటకు నాకవకాశము లేదు. మీకు వినుటకు ఓపికను ఉండదు. కాబట్టి విషయమును సమస్తమును నా నేర్చినకొలదిని సంగ్రహపఱచి రెండు ఉపన్యాసములలో జెప్పదలఁచితిని. మొదటి యుపన్యాసమున రాజకీయరంగమున నాంధ్రులు భారతాభ్యుదయమున కెట్లుతోడ్పడిరో వివరించుచున్నాను. రెండవదానియందాంధ్రులు భారతీయ సంస్కృతి కెట్లు తోడ్పడిరో తెలుపుచున్నాను.

ఆంధ్రులనఁ నెవ్వరో, వారెట్టివారో మొట్టమొదట విచారింపవలయున్నది. ఆంధ్రులను మాటకు రెండు విధములుగా నర్థము చెప్పవచ్చును ౧) 'ఆంధ్రజాతికి జెందినవారు' అని. ౨) 'ఆంధ్రదేశమున నివసించువారు' అని,

౧. ఆంధ్రనామాంకితమైన ప్రత్యేకజాతి యొకటి ఐతరేయ బ్రాహ్మణమున పేర్కొనఁబడి యున్నది. విశ్వామిత్రునకు నూర్వురు పుత్రులు గలరు. అందు మొదటి యేఁబదుగురితో మనకు పనిలేదు;

తక్కిన యేబదుండ్రే ప్రస్తుత ప్రకరణమున ప్రస్తావింపదగినవారు. వారిని ఆర్యాశ్రమముల సరిహద్దులలోనివసించునట్లతడుశపించెను. వారే ఆంధ్ర పుండ్ర శబర పుళిందమూతిబాదిజాతులవారు. వీరెచ్చటివారో ఐతరేయబ్రాహ్మణమున జెప్పియుండలేదు. ఆంధ్రులప్రశంస పురాణములయందును గలదు. మత్స్యపురాణమున ఉత్తరదేశములను వర్ణించు పట్టున

"బాహ్లికా వాటధానాశ్చ ఆభీరాః కాలకేయకాః
పురన్ధ్రాశ్చైవ శూద్రాశ్చ పల్లవాశ్చాత్తఖండికాః"

అనికలదు- ఇట్టే భాగవత పురాణమున ఉత్తర దిక్ప్రజలను వర్ణించు సందర్భమున,

'కిరాతహూణాన్ యవనాన్ధ్రాన్ కజ్కాన్ ఖశాన్ శకాన్'

అనియున్నది. ఇందువలన నాంధ్రులు బాహ్లిక వాటధానాభీర కాలకేయ శూద్రపల్లవాత్త ఖండిక కిరాతహూణ యవనకజ్క ఖశ శకాదుల వలె ఉత్తర జనపదములవారని తెల్లమగుచున్నది. వారి వాస్తవ నివాసస్థానము గనుగొనుటకు పురాణములందు కొంత సాధన సామగ్రి కలదు. పురాణములందు భారతవర్ష భూగోళమును వర్ణించు నధ్యాయమొక్కటి కలదు. అందు ఆయా నదుల కుత్పత్తి స్థానమొకటి పేర్కొనబడియున్నది. ఇవి యన్నియు హిమవద్గములోని బిందుసరమను సరస్సున బుట్టును. ఆ యారు నదులలో మూడు పశ్చిమముగ ప్రవహించును. అందొకటి సీతా, రెండవది చక్షు, మూడవది సింధు. ఈ మూడింటియందును సింధునదిని గుర్తించుట సులభము. అదిఇప్పటి మన సింధునదియే. తక్కిన రెంటిలో సీతానది హిమాలయమున ఉత్తరమున చీనాదేశమునుండి జంబూద్వీపమునకు వచ్చు మార్గమున నున్నట్లు బౌద్ధయాత్రికుడు యువన్ ఛ్వాంగు వ్రాసియున్నాడు. మూడవదియగు చక్షునదిని గుర్తుపట్టుటకు కొంత శ్రమ పడవలసియున్నది. ఈ పరిశోధనకు ప్రారంభించుటకు మునువొక్క విషయమును స్మరణకు

దెచ్చుకొనవలసియున్నది. పురాణోక్త భారతవర్షము ఇప్పటి భారత దేశమువంటి సంకుచిత భూమండలముగాదు. హిందూస్థాన పాకిస్థానములు రెండును అందిమిడియుండుట ప్రత్యేకించి చెప్పవలసిన యావశ్యకతలేదు. బలూచిస్థాన్ ఆఫ్ఘన్‌స్థానములును బాకుపర్యంతమువ్యాప్తమైన రాష్ట్రమంతయు భారతవర్షాంతర్గతమే. గ్రీకులనాడు కూడ హిందూకుష పర్వతశ్రేణి కవ్వల బాకుపర్యంతముగల రాజ్యమునకు వైటు ఇండియా యను పేరుండెను. ఈ యంశమును జ్ఞప్తియందుంచుకొని చక్షునదిని గుర్తించుటకు దొడగుదము. ఇది ఆక్ససునది. దీనికి మనవారు అక్షు (సం. అక్షి = కన్ను) అని గ్రహించిరి. దీనికి 'వక్షు' 'వంక్షు' అను రూపాంతరములును సంస్కృత వాఙ్మయమున గలవు. మంగోలియన్ భాషలో 'చక్షు' అనియు, టిబేటీయ భాషయందు 'పక్షు' అనియు, చీనా భాషలో పొత్సు లేక ఫొత్సు అని యు పేర్లు. యువన్ఛ్వాంగు ఆక్ససునదిని 'ఫొత్సు' అనియే పేర్కొనియున్నాడు. అక్షునదియే యనుటకు సంశయము లేదు.

పురాణములందు చక్షు నదీతీర దేశము లిట్లు పేర్కొనబడియున్నవి. వాయుపురాణమునందిట్లుకలదు.

> అథ చీనమరూంశ్చైవ నఙ్గణాన్ సర్వమూలికాన్
> సాంధ్రాంస్తుషారాంస్తంపాకాన్ పహ్లవాన్ దరదాన్ శకాన్
> ఏతాన్ జనపదాన్ చక్షుః ప్లావయన్తి గతోదధిమ్॥

మత్స్యబ్రహ్మాండ పురాణములందు చక్షునదీతీరమందలి ప్రజలలో నాంధ్రుల ప్రస్తావము లేదు, మత్స్యపురాణమునందు.

> అథవీరమరూంశ్చైవ కాలికాన్ శ్చైవ శూలికాన్ తుషారాం
> బర్బరానఙ్గాన్ పహ్లవాన్ పారదాన్ శకాన్
> ఏతాన్ జనపదాన్ శ్చక్షుః ప్లావయిత్వోదధిగ్గతా' అనియు

బ్రహ్మాండమున,

అథచీన మరూంశ్చైవ తాలాంశ్చ మనమాలికాః
భద్రాంస్తుషారాఁలంపాకాః బాహ్లావాః పారటాన్ ఖశాన్
ఏతాన్ జనపదాంచక్షుః ప్లావయన్తీ గతోదధిమ్ ॥

అనియు కలదు. మత్స్యబ్రహ్మాండ పురాణములందీపట్టున ఆంధ్రప్రశంస లేకపోవుటకు నొకకారణముతోఁచుచున్నది. వాయు పురాణమునందు 'సాంధ్రాఃస్తుషారాః' అని చెప్పియుండుటవలన ఆంధ్రులును తుషారులును కలసి యొక్క జాతిలోని వారుగ పరిగణింపఁ బడుచుండిరనుట తెల్లము. మత్స్యబ్రహ్మాండ పురాణకారులు తుషారులను పేర్కొని యుండుటవలన ప్రత్యేకించి వారిలో నొక తెగవారైన యాంధ్రులను పేర్కొనవలసిన యావశ్యకత లేదని వదలియుండ వచ్చును. ఈ యూహ సరియైనదని నాసమ్మతము, ఏలయనఁగా ఆంధ్రులపేరెత్తని మత్స్యబ్రహ్మాండ పురాణములు రెండును మూలికులను, పహ్లవులను, తుషారులను పేర్కొని యున్నవి. ఇందు మొదటి రెండు తెగలవారును ఆంధ్రజాతికి జెందినవారే మూలకులు మన ములకలే. ములకనాడు వీరి పేరబఱగిననాడే. ములకనాటి బ్రాహ్మణులెల్ల మూలకుల సంతతివారే ఇట్లే పహ్లవులు దక్షిణాంధ్రమునను ద్రావిడదేశమునను దాదాపేడువందల యేండ్లు రాజ్యపాలన మొనర్చిన పల్లవులే. తుషారులు మాత్రము తరువాతి భారతదేశమున గానరారు, వీరు శాకు పరిసర మధ్యాసియా యందే నిలిచిపోయినట్లున్నది. వీరిని తరువాతి యుగమున తుఖారులని పిలిచెడివారు. వీరిభాష తుఖారభాష. ఆంగ్లమున దీనికి తుఖారిష్ అనిపేరు. ఇటీవల ఈభాషయందు రచించబడిన గ్రంథములుకొన్ని బయలువడినవి. అది యార్యభాషా కుటుంబమునకు జెందినదని నిశ్చయమైనది.

ఇంతవఱకు చెప్పినదానియందు సారాంశమేమనఁగా,

౧. ఐతరేయ బ్రాహ్మణమున ఆంధ్రుల ప్రస్తావమున్నను, వారి నిలయమెద్దియో యందు పేర్కొనియుండలేదు.

౨. పురాణములలో నాంధ్రులు తుషారమూలక పహ్లవాదులతోగూడ, హిమవన్నములోని బిందసరమును నుత్పత్తియై యుత్తరవాహినిగ ప్రవహించు చక్షునదీతీరమున నివసించుచుండినట్లు చెప్పియున్నది.

3. చక్షునదియే అక్షులేక ఆక్సనది. ఇదియే ఇప్పుడు ఏరల్ సముద్రమున బడుచున్నది.

౪. కావున మనకు లభించిన యాధారములను బట్టి చూడగా నాంధ్రుల యాదిమ నివాసస్థానము ఇప్పటి యాఫ్ఘనిస్థానమునకు త్తరమున నుండు మధ్యాసియాయని తేలుచున్నది. తక్కిన ఆర్యుల వలెనే వీరును దక్షిణముగ భారతదేశమునకు వలసలువచ్చి తుదకు దక్షిణాపథమున స్థిరనివాసము లేర్పరచుకొనిరి. వీరు నెలకొన్న దేశమునకే ఆంధ్రదేశమని పేరు వచ్చినది.

## ఆంధ్రులు దక్షిణాపథమునకు వచ్చినదెప్పుడు?

ఆంధ్రులు దక్షిణాపథమున కెప్పుడు వచ్చిరో నిశ్చయించి చెప్పుటకు వీలులేదు. బౌద్ధ వాఙ్మయమున ఆంధ్రజాతికి జెందిన మూలక అశ్మకులను తెగలవారు పేర్కొనబడియున్నారు. మూలకుల ముఖ్య నగరము ప్రతిష్ఠానము; అశ్మకుల లేక అస్సకుల ప్రధాన పట్టణము పోతన. రెండును ఇప్పటి హైదరాబాదు రాజ్యములోనివే. ప్రతిష్ఠానమే ఇప్పటి పైఠాణ్; పోతనయే ఇప్పటి బోధను. కాని పై చెప్పిన బౌద్ధగ్రంథము లెప్పుడవి రచింపబడెనో తెలియదు; కావున యాంధ్రుల యాగమన కాలమును నిర్ధారించుటకవి సాధకము గాజాలవు. కాని మౌర్యయుగమప్పటికి యాంధ్రులు దక్షిణాపథమున నెలకొని యుండి

రని యవన గ్రంథములవలన దెలియవచ్చుచున్నది. సెల్యూకసు నికే టారను యవనరాజు చంద్రగుప్తమౌర్యుని యాస్థానమునకంపిన రాయబారి మెగాస్తినీసను నతఁడు భారతదేశమున దాను కన్న విన్న విషయముల నన్నిటిని ఇండికాయాను గ్రంథమున వర్ణించి యున్నాడు. అందు ఆంధ్రులను గూర్చి యతఁడిట్లు వ్రాసియున్నాడు. 'ఆంధ్రరాష్ట్రమున 30 కోటలచే సంరక్షితమైన పట్టణములును వారి సైన్యమున ౧౦౦,౦౦౦ పదాతులును ౨౦౦౦ గుఱ్ఱములును ౧౦౦౦ ఏనుఁగులును గలవు' అని. చంద్రగుప్తుఁడు మౌర్యసామ్రాజ్యమును స్థాపించినది క్రీ. పూ. ౩౨౨ వ సంవత్సరమునని సునిశ్చయమైనది. అప్పటికి ఆంధ్రులు దక్షిణాపథమున గొప్ప రాజ్యమును స్థాపించియుండుటవలన వారంతకు కనీసమొక నూరేండ్లకు ముందైన నీచోటికి వచ్చి నెలవులేర్పరచుకొని యుండవలయును. కావున వారి యుద్గమన కాలము క్రీ.పూ. ౫ వ శతాబ్దమై యుండవచ్చునని మనము తాత్కాలికము నంగీకరింపవచ్చును.

## ఆంధ్రులజాతి - వారిశాఖలు

ఆంధ్రులగూర్చి వాదప్రతివాదములు పెక్కెట్లుగ నడచుచున్నవి. పరిశోధకులు పరస్పర విరుద్ధసిద్ధాంతములను వెలిబుచ్చియున్నారు. ఆంధ్రులార్యులుగారు; ద్రావిడజాతికి జెందినవారని పెక్కుమంది వాదింతురు. అది సరికాదు, వారార్యులేయని కొందఱు చెప్పుదురు. ఉభయ పక్షములవారును వారి వారి కనుకూలమైన యుపపత్తులను జూపి తమ వాదమును నెలకొల్ప బ్రయత్నము జేసియున్నారు. ఈ యుభయవాదముల ఖండన మండనములకిచట నవకాశము లేదు. కాని లభ్యమైన యాధారములబట్టి చూడగా నాంధ్రులను ద్రావిడులని యనుకొనుటకంటె ఆర్యులనుటయె యుక్తమని తోచుచున్నది. ఈ సందర్భమున రెండు ముఖ్యాంశములను మనము దృష్టియందుంచుకొనవలసియున్నది.

౧. ఇంతవరకు మనకుపలబ్ధమైన చరిత్రాధారముల యందేం దును ఆంధ్రుల జాతి యిట్టిదని చెప్పియుండలేదు. శబరపుళిందాదులలో గూడ వీరినైతరేయ బ్రాహ్మణమున పేర్కొని యుండుటచేత ఆధునిక పరిశోధకులు వారనార్యులని యూహించిరి; కాని,

౨. వాయు పురాణము వారిని తుషారులతో గలిపి వారిరువురే కజాతికి జెందినవారైనట్లు సూచించియున్నది. తుషారులభాష యార్య భాషాకుటుంబమునకు జేరినదని ఇంతకు పూర్వము నుడివియున్నాను. తుషారులవలె నాంధ్రులును తుషారీయ భాషనో లేక తత్సదృశమైన మఱియొక భాషనో మాటాడుచుండి యుండవలయును. భాషనుబట్టి జాతిని నిర్ణయించుట సరికాదని భాషాశాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఈ న్యాయము ననుసరించి మనము ఆంధ్రులుజాతిచే నార్యులని చెప్ప శంకించినను, వారార్యభాషా కుటుంబమునకు జెందినయొక భాష వాడుచుండిన ప్రజలని యొప్పుకొనవలసియున్నది.

ఆంధ్రులేకజాతివారైనను వారియందు భేదములు లేకపోలేదు. ఈయంశమింకనుచక్కగ చరిత్రకారులదృష్టికెక్కలేదు. తత్కారణమున పెక్కు విపరీత వాదములు తలచూపినవి. పురాణములన్నియు నేకగ్రీవముగ సాతవాహను లాంధ్రులని ఘోషించుచుండ వారాంధ్రులు కారని పెక్కురాధునిక చరిత్రపరిశోధకులు వాదించుచున్నారు. దీనికి ముఖ్యకారణము సాతవాహనులు తమశాసనములందెచ్చటను దాము ఆంధ్రులమని చెప్పుకొనక పోవుటయే. రాజులు తమ శాసనములందు వంశమును కులమును బేర్కొనుటయాచారము; జాతిని పేర్కొనుట వాడుకయందుండినట్లు తెలియరాదు. జాతిని తమశాసనములలో జెప్పుకొనక పోయినంతమాత్రమున వారాంధ్రులు కాకపోలేదు. ఆంధ్ర జాతియందనేక గణములు గలవు. ఒక్కొక్క గణమునకును ప్రత్యేక నామముండెడిది. వానియందు సాతవాహనగణ మొక్కటి. పల్లవాశ్వక మూలకులని నింతకు పూర్వమె పేర్కొని యున్నాడను; వీనిగాక

కళింగ సాలంకాయన బృహత్ఫలాయనేక్ష్వాక హిరణ్యకపూగీయాది గణములు కొన్ని ప్రాచీనాంధ్రదేశ శాసనములందు పేర్కొనబడి యున్నవి.

మఱియు నన్యజాతులవారనేకులు ఆంధ్రులతో గలసి కాలక్రమమున నాంధ్రులై పోయిరి. ఆంధ్రులు దక్షిణాపథమునకు వచ్చినప్పు డది నిర్జన ప్రదేశముగాదు. రామాయణకాలమప్పటికి దానికి జనస్థానమని పేరుకలిగినది. ఇది చరిత్రకు పూర్వయుగమునాటిమాట. అప్పు డిచ్చటనుండినవారు నేటి కోయ ఖాంశబా చెంచు జాతులవారి పూర్వీకులని భ్రేపాంబి శాస్త్రజ్ఞులయభిప్రాయము. ఆంధ్రులీయాదిమ ప్రజల నెలవుల నాక్రమించుకొన్నను వారిని యడపొడ లేకుండునట్లు ధ్వంసము సేయలేదు. రాజ స్వాతంత్ర్య ప్రియులగు కొందఱు దుర్గమ పర్వతారణ్యసీమలకు వలసలేగినను పెక్కండ్రు జన్మభూమిని విడువక నాంధ్రుల యధికారము నంగీకరించి కాలక్రమమున వారిలో గలిసి పోయిరి.

ఈ జాతుల కలయిక అంతట నాగిపోలేదు. చారిత్రక యుగమునందుగూడ అన్యజాతులవారనేకులు ఆంధ్రదేశమునకు వచ్చి యచ్చట స్థిరనివాసము నేర్పఱచుకొని కాలక్రమమున నాంధ్రులై పోయిరి. ఇట్లాంధ్రప్రజయందు గలిసిపోయిన అన్యజాతులవారిలో ప్రథమమున పేర్కొనదగిన వారరవలు. తమిలదేశపుటుత్తర సరిహద్దు ప్రాంతమునకు గడు ప్రాచీనకాలమున అరువావడతలై యనిపేరు. ఇచటి ప్రజలరవలు. వారాడుచుండిన భాష భ్రష్టతమిలము. ఈ యరువావడతలై దక్షిణమున పాలారు తటమునుండి యుత్తరమున కృష్ణపర్యంతము వ్యాపించి యుండె ననుటకు గొన్ని నిదర్శనములు గలవు. ఆంధ్రులకీ యరవలు దక్షిణమున పొరుగువారు; వీరిభాష తలిపమును పోలియుండుటచే తమిలము దమిలమని పిలువక అరథమని నామకరణము గావించిరి. ఆమాటయే నేటికిని మనభాషయందు స్థిరమై నిలిచిపోయినది. క్రమక్రమముగ

నాంధ్రులు దక్షిణముగ వ్యాపించి ఇప్పటి ద్రవిడ మండలము వఱకు గలయు నాపకతల రాష్ట్రము నాక్రమించుకొనిరి. అరువావడతల యాంధ్రదేశమున గలిసి నామమాత్రావశిష్టమైపోయినది. అచటిప్రజలాంధ్రులైరి. తరువాత పేరొందదగిన యన్యజాతి ప్రజలు తమిలులుముఖ్యము గవీరు చోలమండలమునుండి వచ్చిరి. కరికాలచోళమహారాజు దక్షిణాంధ్రము నంతటిని జయించి స్వాధీనము జేసికొనెను. అతని సంతతివారు కొండకు కడపమండలాంతర్గతమైన రేనాటిసీమ యందు నెలకొనిరి. వీరిని రేనాటి చోళులందురు. వీరి సంతతివారు తామరతంపరలై యభివృద్ధినంది తెలుగు చోళులను పేర నాంధ్రదేశమునందెల్లెడల వ్యాపించి యాంధ్రదేశాభ్యుదయము నకు జాలవఱకు తోడ్పడిరి. వీరిముఖ్యస్థానము రేనాడొక్కటియేకాదు. పొత్తపి, నిడుకల్లు, పెడగల్లు, యాలగిరి, వర్ధమానపురము, కొణిదెన, నెల్లూరు సిద్ధవటము మున్నగునవి వీరి యితర ముఖ్యస్థానములు. చోళమండలమునుండి వచ్చి రేనాట నెలకొన్నది చోళరాజు కుటుంబమొక్కటి యెకాదు. వారితో గూడ వారిపరిచారకులును నాశ్రితులును నియోగివర్గమును సైనికులును వచ్చి యచట కుదురుకొనిరి.

తమిలుల యభిగమన మంతటిలో నాగలేదు. పూర్వ చాళుక్య యుగమున యరవ రాజ్యాధిపతులతో గొంత సంబంధమేర్పడినది. మరల తమిలు లాంధ్రదేశమునకు రాగడంగిరి. గుణగవిజయాదిత్యుని కాలమున తమిలులాంధ్రదేశమున మరల తలచూపిరి. రెండవ చాళుక్యభీముడు తన కుమార్తెను కుందవ్వను చోళరాజు పరాంతకుని కొడుకరంజయునకిచ్చి వివాహము జేసెను. అతని పుత్రుడగు దానార్ణవుడు వంబవ్వయను తమిలు రాజకన్యనుద్వాహము జేసికొనెను. దానార్ణవుని మరణానంతరము చాళుక్యుల అధికారము ముగిసినది. అతని పుత్రులు ప్రథమ శక్తివర్మ విమాలాదిత్యులు నిజకుటుంబములతో గూడ చోళరాజ్యమున నిరువది ఏడేండ్ల కాలము ప్రవాసముండవలసి వచ్చెను. అప్పుడువారికి పూర్వమునుండి వంశపారంపర్యముగ

వచ్చుచుండిన తమిళ సంబంధము చక్కఁగ దృఢపడినది. తమిళులపై నభిమానమును, తమిళు పద్ధతులయందాదరమును హెచ్చినవి. చోళ చక్రవర్తి మొదటి రాజరాజు తన కుమార్తెను కుందవ్వను విమలాదిత్యునికిచ్చి పెండ్లిచేసి మొదటి శక్తివర్మను కులక్రమాగతమైన వేంగీ రాజ్యమున పునఃప్రతిష్ఠించెను. విమలాదిత్యునికి కుందవ్వయందు కుమారుడొకఁడుద్భవించెను. అతనికి రాజరాజని యతని మాతామహుని పేరు బెట్టిరి. ఇతఁడే మనరాజరాజ నరేంద్రుఁడు, ఇతఁడు తనమేనమామయగు మొదటి రాజేంద్ర చోళచక్రవర్తి కుమార్తెను అమ్మంగ దేవిని వివాహము చేసుకొనెను, వీరికి కలిగిన పుత్రునికి రాజేంద్రుఁడని యతని మాతామహుని పేరుపెట్టిరి. అతఁడు తన మేనమామయగు నిమ్మడి రాజేంద్ర చోళ చక్రవర్తి కుమార్తెను మధురాంతకిని పెండ్లాడెను. ఇట్లు తరతరముగవచ్చు చోళచాళుక్య రాజవంశముల పరస్పర సంబంధమువలన తమిళుల వ్యాపకమాంధ్రదేశమున క్రమముగ హెచ్చఁజొచ్చెనది. మొదటి శక్తివర్మ చోళసామంత రాజ్యముగ నుండిన నాఁడు వేంగీ చాళుక్య రాజ్యము దనప్రత్యేకతను సంపూర్ణముగ గోలుపోయి చోళసామ్రాజ్యాంతర్గతమండలములలో నొక్కటియైయుండు గలిసిపోయెను. రాజరాజనరేంద్రుని కుమారుఁడు రాజేంద్రుఁడుతన మేనమామయగు చోళ చక్రవర్తి వీరరాజేంద్రుఁడు స్వర్గస్థుఁడైనపిమ్మట చోళ సింహాసనము నాక్రమించుకొని చోళసామ్రాజ్యమున కంతటికిని అధిపతియాయెను. కొందరాంధ్రచరిత్ర పరిశోధకులు దీనినాంధ్రవిజయముగ పాటించి యుబ్బుదురు; కాని వారి యుబలాటమునకెట్టి అవకాశమునులేదు. రాజేంద్రుఁడాంధ్రుఁడని తలఁచుటకంటె దమిళుఁడని యెంచుట యొప్పును. చాళుక్యవంశమున జన్మించినను నతని రక్తనాళములందు బ్రవహించుచుండెడినది తమిళరక్తము (ఇతని తల్లియు నవ్వయు దమిళ రాజపుత్రికలు. తండ్రి సగము తమిళుండైన ఇతఁడు సంపూర్ణముగఁ దమిళుఁడని చెప్పవచ్చును. ప్రాయశః నితఁడు చోళదేశమున మాతామహుని ఇంటబుట్టి యచటనే పెరిగి విద్యగఱచినట్లున్నది. కావున నితనికి దమిళులయెడ నభిమానమును వారి యాచార వ్యవహా

రములపై గౌరవమును వారి జీవితవిధానములందభిరుచియు సహజముగఁ గల్గినవి. ఈ కారణమున దన తండ్రి మరణానంతరము గొన్నియేండ్ల కతనికి పితృపైతావహమైన వేంగీరాజ్యము లభించినను అతని దృష్టి యంతయు చోళసామ్రాజ్యమునఁ దగ్నమైయుండినది; చోళసామ్రాజ్యాధిపత్యమును బొందిన పిమ్మటన వేంగికి స్వస్తిచెప్పి చోళదేశమును బోయి చేరుకొనెను. అప్పటి రాజకీయ పరిస్థితులనుబట్టి యతఁడట్లు చేయవలసి వచ్చెనని యొప్పుకొందమన్నను, కులగోత్రములను త్యజించుటకు అతిసిబ్బిగల తమిలాభిమానముకంటె సరియైనకారణము వేఱొద్ది యుగావరాదు. చాళుక్యాన్వయమును మానవ్యసగోత్రమును నచ్చక పోయినవి. చోళవంశమును కాశ్యపగోత్రమును ఆకాంక్ష్యములాయెను. కులగోత్రములతోఁగూడ జన్మనామమైన రాజేంద్రాభిధ త్యక్తమై కులోత్తుంగ చోళనామము స్వీకృతమైనది. తండ్రిచే ప్రారంభింపఁబడిన ఆంధ్రభారత మసంపూర్ణస్థితియందక్కడ నిలిచిపోయినది. అతని యభిమానాదరముల కది పాత్రముగాలేదు; కాని యతఁడు తమిలు కవిజన కల్పవృక్షమాయెను. పెక్కండ్రు తమిలు కవులితని యాశ్రయమును బొంది చక్కని తమిలు కావ్యములను రచింపఁగడగిరి. జయంగొండరు చేవిరచితమైన కలింగత్తుప్పరణి ఇతని కాలమున వెలువడిన కావ్యములలో నుత్కృష్టమైనది. కులోత్తుంగుని సంతతి వారందఱును అతని మార్గమును ననుసరించిరి. వీరికి చాళుక్యచోళులని చరిత్రకారులు నామకరణము చేసియున్నారు. చాళుక్యచోళుల యేలుబడియందు ద్రావిడులు మునుపటికంటె హెచ్చుగ రాగడగిరి. రాజకీయోద్యోగులు సైనికులు తండతండములుగవచ్చి యాంధ్రదేశమున నెలకొనిరి. ఇప్పుడు కానవచ్చు ద్రావిడ ద్రావిడ బ్రాహ్మణుల పూర్వికులు కొంచెమించుమించుగ నందఱును అప్పుడు వచ్చినవారలే.

చాళుక్య చోళయుగము ముగిసిన వెనుక నీద్రావిడవాహిని శోషిల నారంభించినది; కాని సంపూర్ణముగ నమసిపోలేదు. మతప్రచారముకొఱకు ద్రావిడులనేకులాంధ్రదేశమునకు వచ్చి శిష్యవర్గమును

గుదుర్చుకొని యచటనె స్థిరముగ నిలచిరి. వీరియందు ముఖ్యముగ
చేర్కొనదగినవారు రామానుజ వైష్ణవమతాచార్యులు. కాకతీయుల
కాలమునను ఆటుపిమ్మటను ఆంధ్రదేశమున రామానుజ వైష్ణవమతము
ప్రబలినది, తెలుగురాజులనేకులు వైష్ణవమతము నవలంబించి దాని
వెంపొందించుటకు ప్రచారకులను బిలిపించి వారికాశ్రయమొసంగుచుం
డిరి. అప్పుడప్పుడు సదాచార సంపన్నులైన శైవులుగూడ ద్రావిడదేశ
మునుండి మతాచార్యులను రప్పించుకొనెడివారు.

తమిళుల తరువాతరువాత నెన్నదగినవారు కర్ణాటకులు. వీరిని
కేవల మన్యజాతివారని చెప్పుటసరికాదు. ఏలయన తెలుగులును కన్న
డిగులును ఒక్కరక్తబిందువునుండి చెదరిన రెండుకణములే తెలుగు కన్న
డిగ లిర్వురును ఆంధ్రజాతికి జెందినవారే. కాలక్రమమున ప్రబలచారి
త్రక కారణముల వలన వారొండొరులనుండి వేర్పడి ప్రత్యేకజనులుగ
నేర్పడిరి. ఈ భేదము ముఖ్యముగ నాంధ్రులకు దమిళులతోడి సంప
ర్కమువల్ల గలిగినది. దీని నిప్పుడు వివరించుటకు వీలుకాదు. మఱియొక
యుపన్యాసమున నీ విషయమును విపులీకరించి చెప్పవలసిన యావశ్య
కతగలదు; కావున నీవిషయము ప్రస్తుతము నిట జర్చింపక ఆంధ్రదేశ
మునకు గర్ణాటకుల రాకను వర్ణింతును.

చారిత్రక యుగమున ఆంధ్రదేశమునకు వచ్చిన మొదటి కర్ణా
టకులు చాళుక్యులు. వీరి యాగమనముతో నాంధ్రదేశ చరిత్రమునం
దొక నూతన యుగము ప్రారంభమగుచున్నది. చాళుక్యుల చరిత్ర
చిత్రమైనది. వీరు కర్ణాటకులే యైనను వీరి చరిత్ర యాంధ్రదేశమున
ప్రారంభమగుచున్నది. ఇక్ష్వాకు నరపతుల కాలమున వారి యేలుబడి
క్రిందనుండిన హిరణ్యకులను తెగవారు కడప మండలములోని జమ్మల
మడక ప్రాంతభూములను పాలించుచుండిరి. వారి యునికి పట్టుగుట
వలన దానికి హిరణ్యరాష్ట్రమని పేరువచ్చినది. ఈ హిరణ్యకులలో
జాళుక్యులొక్క తెగవారని తలంచుటకు గొంతయాధారముగలదు.

ఇక్ష్వాకు వంశజుఁడగు వీరపురీశదత్త మహారాజు కాలమున హిర
ణ్యక వంశ సంభూతుఁడగు ఖందచెలికిరెమ్మణకుఁడు మహాతలవారపద
మున నియుక్తుఁడై యుండెను. ఖందచెలికిరెమ్మణకుఁడనఁగా ఖంద
చెలికి (స్కందచాళుక్యుని) కుమారుఁడో మనుమడోయగు రెమ్మణ
కుఁడని యర్థము. కావున మొట్టమొదటి చారిత్రక పురుషుడనఁదగు
రెమ్మణక చాళుక్యుఁడు హిరణ్యరాష్ట్రవాస్తవ్యుఁడనుట తెల్లము. ఈ
సందర్భమున స్మరణకుదెచ్చుకొనవలసిన యంశమొకటి కలదు. క్రీ. శ.
౧౧ వ శతాబ్ద ప్రారంభమునుండి పూర్వ చాళుక్యరాజుల శాసనము
లందు గానవచ్చు చాళుక్య వంశానుక్రమణికయందు చాళుక్యవంశము
నకు మూలపురుషుడగు విజయాదిత్యుఁడు రణమున త్రిలోచన పల్లవునిచే
నిహతుఁడైనది జమ్మలమడుగు ప్రాంతముననే. గర్భిణియైయుండిన విజ
యాదిత్యుని దేవి తలదాచుకొన్న ముడివేమగ్రహార మిప్పటి జమ్మల
మడుగు తాలూకాలోనిదే. ఇది యిప్పుడు పెదముడియ మను పేరఁబఱ
గుచున్నది. మఱియు విజయాదిత్యుని కుమారుఁడు విష్ణువర్ధనుఁడు పెద్ద
వాడైన పిమ్మట నందాభగవతి నారాధించి వరములు వడయుటకేగిన
చాళుక్యగిరియు నిచ్చటిదే. పూర్వచాళుక్య తామ్రశాసనములలో గాన
వచ్చు చాళుక్యవంశానుక్రమణికయు విజయాదిత్యోదంతమును కల్పన
లని కొందఱు పరిశోధకులు చెప్పుదురు; వారట్లనుటకు ప్రబలకారణ
ములుగలవు. కల్పనలని యొప్పుకొన్నను, వంశానుక్రమణిక నిర్మాతలు
గూడ చాళుక్యుల చరిత్రను హిరణ్యరాష్ట్రమునందే ప్రారంభించుట
జూడ నందేదో సత్యము కొంతనిగూఢమైనట్లు తోఁచుచున్నది. చాళు
క్యులాద్యమున ఆంధ్రదేశాంతర్గతమైన హిరణ్యరాష్ట్రమున నుండిరి
కదా. మఱి వారు కర్ణాటకులెట్లైరి? అను ప్రశ్నయొకటి రావచ్చును

ఇందు వింతయేమియులేదు. ప్రాచీనాంధ్రదేశ విభాగమును గొంచెము
దెలిసికొంటిమేని పై సమాధానమును సులువుగ జెప్పవచ్చును. క్రీ. శ.
ప్రారంభ శతాబ్దములందు కృష్ణకు దక్షిణమున తూర్పు సముద్రతీరమున
నుండియు బశ్చిమమున కోలారుమండల పర్యంతముగల దేశమాంధ్ర
పథమను పేరఁగుచుండెను. మనకు దెలిసినంతమటుకు నిదినాలుగురాష్ట్ర

ములుగ విభజింపబడియుండెను. ౧. తూర్పున కర్మరాష్ట్రము; ౨. దానికి పశ్చిమమున హిరణ్యరాష్ట్రము, 3. దానికి ఉత్తరమట కన్నాడు ౪. కడపట నిప్పటి బళ్ళారి ప్రాంతమున సాతవాహనరాష్ట్రము. వీని యందు మనమిప్పుడు ముఖ్యముగ గమనింపవలసినది కన్నాడు. దీనికే కన్నవిషయమనికూడా పేరు. దీనిగుండా నాంధ్రికాయను నదియొక్కటి ప్రవహించుచుండినది. ఈ యంధ్రికానది ఇప్పుడు కర్నూలు సమీపమున తుంగభద్రయందు గలసెను అంధ్రి లేక హాంధ్రి. ఇందువలన ప్రాచీనకాలమున కర్నూలు పరిసర దేశమునకు కన్నాడను పేరుండెనని తెలియుచున్నది. కన్నాడు కర్ణాశబ్దభవము. కర్ణనాడన (శాత) కర్ణరాజులేలిన రాష్ట్రము. ఈ రాష్ట్రవిభాగము విజయనగర రాయల కాలమునగూడ నుండినది. అప్పుడు దీనికి కర్ణాటసీమ యనిపేరు. చాళుక్యులీరాజ్యమును జయించి యందు సుప్రతిష్ఠితులై యుండిన కారణమున వారు కర్ణాటకులైరి.

చాళుక్యుల యాదిమ నివాసస్థల మెద్దియైనను వారు తీరాంధ్ర దేశమునకు వచ్చినది కన్నడభూమినుండి. క్రీ. శ. ౫౪౩ ప్రాంతమున మొదటి పులకేశి బిజాపురమండలములోని వాతాపిదుర్గమును సాధించి పాశ్చాత్య చాళుక్య సామ్రాజ్యమునకు బునాదివేసెను. ఇతని మనుమడి పులకేశి సుప్రసిద్ధయోధుడు; అద్వితీయ పరాక్రమశాలి; నేర్పరియైన దండనాయకుడు; దళములను కూర్చుటయందును విప్పుటయందును, వ్యూహరచనయందును యుద్ధరంగమున శత్రువులపై ఫౌజుల నడపుటయందును అతనిలో బోల్పదగిన వారెవ్వరును ఆ కాలమున మరి యెవ్వరును లేరు. పులకేశి పెక్కు దేశముల రాజులను జయించి వారియొద్ద కప్పము గొనెను. ఇతని విజయముల నన్నిటిని నిచ్చట నెన్నవలసిన పనిలేదు. వేంగీ విజయ మొక్కటియే ఇచ్చట ప్రస్తాపనకు దేదగినది. క్రీ. శ. ౬౨౪ సంవత్సర ప్రాంతము వేంగీదేశముపై నెత్తివచ్చి యచ్చట రాజ్యము చేయుచుండిన దుర్జయ వంశజుల నోడించి రాష్ట్రమును స్వాధీనపఱచుకొని తన తమ్ముని కుబ్జవిష్ణువర్ధ

మునిశా రాజ్యమిచ్చి తరలిపోయెను. అంతట వీరాంధ్రదేశముననొక నూతన రాజ్యము స్థాపితమాయెను. దీనికే పూర్వ చాళుక్యరాజ్యమని పేరు. కుబ్జవిష్ణువర్ధనుని సంతతివారిచట దాదాపు క్రీ. శ ౧౧ వ శతాబ్దాంతము వఱకు రాజ్యము చేసిరి.

చాళుక్యుల యాగమనమునాంధ్రదేశమున గొప్ప మార్పు కలిగినది. జాతీయ జీవనము బహుళముగమారి పోయినది. ప్రాత రాజ వంశమంతరించెను; వారిస్థానమున వైదేశికులు రాజ్యము నేలగడగిరి. ఈ మార్పు కేవలము రాజకీయముగాదు: నూతన రాజ్యస్థాపనతో నదియాగలేదు; చాళుక్యులు కన్నడిగులు. ఆంధ్రదేశమునకు లాతివారు. ఆంధ్రదేశమునందు వారు స్థిరనివాసము లేర్పరచుకొన్నప్పుడు వారు తమతోగూడ తమస్త్రీలను పరివారమును దోడ్కొనివచ్చిరి, మరియు దమ యధికారమును నిలబెట్టుకొనుటకు చతురంగబలములను వెంటగొని తెచ్చిరి. వీరందఱును కన్నడిగులే. వీరియధికారముక్రింద రాజ్యపాలనము గావించుటకు వచ్చిన యుద్యోగులను సకల నియోగివర్గమును గన్నడభూమినుండియే వచ్చిరి. వీరితోపాటు వర్తకము కొఱకు వైశ్యులును శూద్రప్రజయు గన్నడమునుండియేవచ్చి రాంధ్రమున పూర్వ చాళుక్యరాజ్యము స్థాపనమైన పిమ్మట కర్ణాటాంధ్ర దేశముల మధ్య రాకపోకలు హెచ్చయి రెండుదేశముల ప్రజాలను దృఢసంబంధమేర్పడినది. దీనికి ఫలము ప్రజాసమ్మిశ్రణము.

## మహారాష్ట్రులు

రాజకీయరంగమున మహారాష్ట్రులు ప్రప్రథమమున ప్రాముఖ్యమునకు వచ్చినది క్రీ. శ. ౧౨ వ శతాబ్దమునందు తత్పూర్వము దక్షిణ భారతముపై నాధిపత్యము కొఱకుబోరాడుచుండిన చోళ చాళుక్య సామ్రాజ్యములు రెండును అంతరించిపోయినవి. వానిస్థానముననాలుగు

నూతన రాజ్యములేర్పడినవి. దక్షిణమున పాండ్యరాజ్యము,తమిళ దేశమంతయు నీరాజ్యమున జేరియుండినది. దక్షిణకర్ణాటకమున హొయ్సలరాజ్యము ఉత్తరకర్ణాట మహారాష్ట్రములందు దేవగిరి యాదవ రాజ్యము. ఆంధ్ర దేశమున ఓరుగంటి కాకతీయరాజ్యము. ఈరాజ్యములొండొంటితో నిరంతరము పోట్లాడు చుండినవి. తన్మూలమున వాటి కొండొంటితో గొంతసంబంధమేర్పడి జనసమ్మిశ్రణ కవకాశము కలిగినది. కాకతీయరుద్రుని మరణానంతరము దేవగిరియాదవులు కాకతీయ రాజ్యముపై నెత్తివచ్చి యుద్ధమున కాకతి ప్రభువునోడించి దేశమున చాలాభాగము నాక్రమించుకొనిరి. కాకతిగణపతిదేవుడు రాజ్యమునకు వచ్చిన పిమ్మట దేశమునంతటిని మరల స్వాధీనము జేసికొన్నను, మహారాష్ట్రసామంత రాజకుటుంబములును వారి పరివారమును తెలంగాణమందును తీరాంధ్ర దేశమునను నిలచిపోయిరి. ఇది యాంధ్ర దేశమునకు మహారాష్ట్రుల యాగమమునకు ప్రారంభము. మహమ్మదీయుల యేలుబడిక్రింద వీరితో సంపర్కమింకను గాఢతరమాయెను. మహమ్మదుబిన్ తుఘ్లాకు కాకతీయరాజ్యమును కూలద్రోసి యాంధ్రదేశమునుఢిల్లీతురక సామ్రాజ్యమున గలుపుకొనెను. సుల్తానుప్రతినిధి యొకడు దక్కను రాజ్యమును సుల్తానుపక్షమున పాలించుట కొరకు నియమింపబడెను. ఈ రాజప్రతినిధి యొక్క రాజధాని మహారాష్ట్రమందలి దేవగిరియను పూర్వనామముగల దౌలతాబాదు. మహమ్మదీయులు యుద్ధరంగమున నేర్పరులే; కాని రాజ్యపరిపాలనయందు వారికి సామర్థ్యము తక్కువ. కావున దేశపాలనము సాగించుటకు వారికి హిందువుల సహాయ మావశ్యకమాయెను. దౌలతాబాదునందలి సుల్తానుప్రతినిధి యాంధ్రదేశపాలన తన యధికారము క్రిందకి వచ్చినపిమ్మట సచటి రాజ్యకార్యములను నెరవేర్చుటకు తనకు తత్పూర్వము లోబడుచుండిన మహారాష్ట్రులనే నియమించెను. ఢిల్లీతుఘ్లాకు సామ్రాజ్య విచ్ఛిన్నమై పోయిన పిమ్మట మహారాష్ట్రమున బహమనీయులొక నూతన మహమ్మదీయ రాజ్యమును స్థాపించిరి. వీరిరాజధాని మొదట గుల్బర్గా, తరువాత బీదరు. వీరును ఢిల్లీసుల్తానులవలె దేశపాలనను హిందూఅధికారుల

మూలమున నడుపుటయే కాక హిందూభటులను నాయకులను విస్తార
ముగా దమ సైన్యములందు జేర్చుకొనిరి. బహమనీ సుల్తానుల యేలు
బడిక్రింది దేశము చాలవఱకు మహారాష్ట్రమగుటచేత వారిచే రాష్ట్ర
పాలనాది దైనందిన రాజకార్యములను నిర్వహింప నియుక్తులైనవారెల్ల
మహారాష్ట్రులే. బహమనీ సుల్తానులు క్రమక్రమముగా తెలంగాణము
నంతట నాక్రమించిరి. వారితోకూడ వారి మహారాష్ట్రాధికారులను
ప్రవేశ చేసిరి. బహమనీ రాజ్యపతనానంతరము దక్కను రాజ్యమును పాలిం
చిన యాదిలశాహి నిజాంశాహి కుతుబుశాహి ప్రభువులందరును వారి
పద్ధతులనే యవలంబించిరి. మొగలాయి చక్రవర్తులుకూడ పూర్వమ
హమ్మదీయ ప్రభువుల మార్గముననే నడిచిరి. కావున కుంపిణీ రాజ్యస్థా
పన కాలము వరకు మహారాష్ట్ర వాహిని యాంధ్రదేశములోనికి ప్రవ
హించుచునే యుండినది.

మహారాష్ట్రులవలెనే ఒడ్డవారును ఆంధ్రదేశమునకు వచ్చి
యచ్చట స్థిరనిలయములు లేర్పరచుకొనిరి. ఒడ్డవారనగా ఓఢ్రదేశ
వాస్తవ్యులు. వీరిప్పుడు తాము కాళింగులమని చెప్పుకొనుచున్నారు.
కాళింగులు తెనుంగువారు, ఓఢ్రులు కారు. వీరిభాష యోఢ్రము.
క్రీ. శ. ప్రారంభమునుండి మాఠరాది వంశజులు కళింగమును
పాలించుచుండిరి. తరువాత పూర్వచాళుక్యులును పూర్వగాంగులును
ప్రభుత్వము సల్పిరి.; క్రీ. శ. ౧౧ వ శతాబ్దాంతమువఱకును కళింగ
మున పూర్వచాళుక్యుల యధికారము చెల్లినది. అందాక పూర్వగాం
గులు సంపూర్ణ స్వాతంత్ర్యమును బొందలేదు; తరువాత వారు ప్రబలి
స్వతంత్రులై తమకు పూర్వదిక్కుననున్న యోఢ్రదేశమును జయించి
తమరాజధానిని కళింగనగరమునుండి మహానదీతీరమందలి బనారసకట
కమునకు మార్చుకొనిరి. ఇదియే ఇప్పటి ఒరిస్సా మండల రాజధాని
యగు కటకము. ఒడ్డవారు క్రీ. శ. ౧౧ వ శతాబ్దమందెప్పుడో
వచ్చిరి క్రీ. శ. ౧౩ వ శతాబ్దమున కడప మండలమును
తత్పరిసర సీమలను వల్లూరుపట్టమును రాజధాని చేసుకొని
యొడ్డరాజులు పాలించిరి. కులముచే వీరు కాయస్థులు. గంగయసాహిణి

జన్నిగిదేవుడు, అంబదేవుడు, మున్నగు వారొడ్డెరాజులలో ప్రముఖులు. వీరెవ్వరో ఎచ్చటనుంచి యే సందర్భమున నాంధ్రదేశమునకువచ్చిరో తెలియదు. కాలక్రమమున వీరిరాజ్యము నాశమందినది; వీరుతమ జాతివ్యక్తిత్వమును గోలుపోయి యాంధ్రప్రజలలో గలసిపోయిరి.

పూర్వగాంగవంశజులు స్వతంత్రులైన పిమ్మట వారు కళింగము నంతటిని స్వాధీనపఱచుకొనిరి. అప్పుడప్పుడు వారు తీరాంధ్రదేశముపై నెత్తివచ్చుచుండినట్లు శాసనములవల్ల దెలియవచ్చుచున్నది. కాని క్రీ. శ. పదునైదవ శతాబ్దమువరకును వారి కాంధ్రదేశమున ప్రవేశముగలిగినదికాదు. క్రీ. శ. ౧౪౩౫ వ సంవత్సరమున పూర్వగాంగవంశ మంతరించినది. సూర్యవంశజుడగు కపిలేశ్వరుడు గజపతి పదము నధిష్ఠించెను. ఇతడుత్కలక్షత్రియుడు. అతనిసంతతివారొడ్డె గజపతులనబడిరి. పదునైదవ శతాబ్దపు టుత్తరార్థమున కపిలేశ్వరగజపతి తీరాంధ్రదేశమును తెలంగాణముతోగూడ జయించి స్వాధీనపఱచుకొనెను. తరువాత దాదాపు నూరేండ్లదాక నిచట నతని సంతతి వారి యేలుబడి చెల్లెను. అప్పుడు ఒడ్డెవారనేకు లీదేశమునకు వచ్చి స్థిర నివాసములేర్పరచుకొని కాలక్రమమున నాంధ్రులలో గలసిపోయిరి. ఇట్లుగలిసి పోయినను ఇప్పటికిని వారిలో గొందఱు తమజాతివ్యక్తిత్వమును సంపూర్ణముగగోలుపోలేదు. తెలుగుదేశమునందెల్లయెడలను ఒడ్డెలనునొకతరగతి జనులు గానవచ్చుచున్నారు. వీరిలోననేకులు భూమిమరమ్మత్తు పనులుసేయుదురు. కొందఱు పశువులపై ధాన్యముప్పు మొదలగు వస్తువులను గొని గ్రామాదులయందు సంచరించుచు వర్తకము జేసిజీవించుచున్నారు. వీరిప్పుడాడు భాష తెనుగే. వారియాచార వ్యవహారములకు గొంత ప్రత్యేకత గలదు. మతముచే నందఱును వైష్ణవులే. వారికి తమపూర్వవృత్తాంతమేమియు దెలియదు; కాని వారికులనామము వారియుత్పత్తిని వెల్లడి సేయుచున్నది.

ఆంధ్రదేశమునకు వచ్చిన కడపటి యన్యజాతి జనులు మహమ్మదీయులు. వీరి మతమొక్కటియె యైనను జాతి యొక్కటికాదు. వీరిలో

నరబ్బులు హాబిషీలు తురకలు పారశీకులు నాఫ్ఘానులు మున్నగు నానాజాతులవారును గలిసియుండిరి. హిందువులు కొందఱు మహమ్మదీయ మతమును స్వీకరించి వీరిలో గలసిరి. మహమ్మదీయులకును తత్పూర్వ మాంధ్రదేశమునకు వచ్చిన యన్యజాతుల వారికిని కొన్ని భేదములుగలవు. మతభేదము ప్రధానమైనది. మహమ్మదీయులకు ముందాంధ్రదేశమునకు వచ్చినవారందఱును హిందువులు, కాలక్రమమున వీరెల్లరును దమభాషను ఆచారవ్యవహారములను విసర్జించి ప్రత్యేకతను గోలుపోయి యాంధ్రులలో గలిసిపోయిరి. మహమ్మదీయులట్లుకాదు. వారిమతము హిందూమతమునకు విరుద్ధమైనది. హిందువుల కన్యమత సహిష్ణుత కలదు. మహమ్మదీయులు సహజముగ పరమతద్వేషులు. తమ మతమే సత్యమనియు దక్కినవన్నియు మిథ్యలనియు వారి దృఢ విశ్వాసము. మిథ్యను ధ్వంసముజేసి సత్యమతమును ప్రపంచము నంతటను ప్రసరింపజేయుట తమవిధియని వారు తలచిరి. కావున మహమ్మదీయులు ఆంధ్రదేశమునకువచ్చిన యన్యజాతుల వలె నాంధ్రులతో గలిసి యేకముగాక తమ ప్రత్యేకతను నిల్పుకొనిరి. భాష వేషములందును సాంఘిక మర్యాదలయందును ఈ ప్రత్యేకత ప్రతిఫలించినది.

ఇంతదూరము ఆంధ్రులనుగూర్చియు కాలక్రమమున నాంధ్రదేశమునకు వచ్చి యచ్చటి ప్రజలతో గలిసిన యన్యజాతులను గూర్చియు వివరించితిని; ఇది కాలహరణము కొఱకు జేసిన వ్యర్థప్రసంగముగాదు. ఆంధ్రజనానీక మెట్టిదనో మీకు దెలియజేయుటయే నాముఖ్యోద్దేశము. నాజీ జర్మనులవలె మనవారికనేకులకు జాత్యున్మాదముపుట్టినది. ఆంధ్రజాతి స్వచ్ఛమైనది. అన్యజాతులకంటె-ముఖ్యముగ ద్రావిడజాతులకంటె నుత్తమమైనది. ఆంధ్రసంస్కృతి వేఱు, అన్యసంస్కృతులకంటె నుత్తమమైనది. అనియుద్ఘోషించుదురు. ఇది బూటకపు టుద్ఘోష ఇంతకుముందు నాచే మీకు నివేదింపబడిన యంశములవల్ల ఆంధ్రుల జాతి స్వచ్ఛమైనదికాదని మీకు విశదపడియుండవచ్చును. ఒక యాంధ్రజాతిని మాత్రము ప్రత్యేకించి పేర్కొన నవసరములేదు. జాతిశాస్త్ర

పరిశోధకులు ప్రపంచమున స్వచ్ఛమైన జాతియే లేదనియు నన్నియు సంకీర్ణజాతులే యనియు సిద్ధాంతీకరించియున్నారు. ఈసిద్ధాంతము సమంజసమైనదని మనమంగీకరింపవచ్చును. జాతికే స్వచ్ఛతలేనప్పుడు సంస్కృతికి స్వచ్ఛత యెట్లు కలుగ గలదు? కావున ఆధునికాంధ్రజనానీకము పెక్కుజాతుల సంసర్గమువలన నేర్పడినదనియు నాంధ్రసంస్కృతి వారి యందలి వైశ్యకృషి మూలమున గలిగిన ఫలమనియు దలంచుట యుక్తము. ఈ యర్థమును సోదాహరణ పూర్వకముగ వివరించుటకొఱకే ఇంతదూరము చెప్పవలసి వచ్చినది.

# ౨

ఇంక ఆంధ్రుల మహత్వమెట్టిదో భారతాభ్యుదయమునకు వారు చేసిన సేవయెట్టిదో విచారింతము. భారత ప్రధాన ప్రజలలో నాంధ్రులు తొలిబంతివారు. జనసంఖ్యచేగాని నివసించు రాష్ట్ర విస్తారముచేగాని హిందీప్రజలకు సమానులో లేక ద్వితీయులో యగుదురు. భారతాభ్యుదయమునకు వీరెంతవఱకు తోడ్పడిరనునది ప్రస్తుతము విచారణీయాంశము మొట్టమొదట రాజకీయ రంగమున వీరి మహత్వాతిశయములను గనుగొనుట యుక్తము. ఆంధ్రుల చరిత్ర సుదీర్ఘమైనది. సంగ్రహముగనైన వారి మహత్కార్యముల నన్నిటి నిచట వర్ణించుట కవకాశము లేదు. కావున ప్రధాన కార్యములను గొన్నిటిని పేర్కొని తృప్తినందవలసియున్నది.

ఆంధ్రులు సామ్రాజ్య నిర్మాతలు. ప్రాచీనమధ్యనిహిందూయుగములందు వెలసిన రెండు సామ్రాజ్యములకు వారు కర్తలు. ఇందు మొదటిది సాతవాహన సామ్రాజ్యము. సాతవాహనులాంధ్రులలో నొక తెగవారని ఇంతకు ముందు జెప్పియున్నాను. బళ్లారి కర్నూలు మండలములలోని సాతవాహన రాష్ట్రము వీరియునికిపట్టు. మౌర్యసామ్రాజ్యమంతరించిన పిమ్మట వీరిలో బ్రాహ్మణుడైన శ్రీముఖుడాంధ్రజాతులనన్నిటి నేకముఖమునకు దెచ్చి దక్షిణాపథమునంతటిని ఒక్కయేలుబడి క్రిందికి తెచ్చెను. అతని తరువాత నాంధ్రులు మగధమును స్వాధీనించి సకల భారతావనికి సామ్రాజ్యపీఠమైన పాటలీపుత్రము నాక్రమించుకొని కొంతకాలము పాలించిరి. గౌతమీపుత్రశాతకర్ణి కాల

మున ఆంధ్రసామ్రాజ్యము వశ్చిమోత్తరమున సౌరాష్ట్రమాళవముల నుండి దక్షిణమున కొల్లడమునదాకు వ్యాపించియుండెను. దాదాపు నాలుగువందల యేండ్ల కాలము శాతవాహన వంశజులు దక్షిణాపథమును పాలించినను వారి యేలుబడిని గూర్చి మనకు దెలియవచ్చువిషయము స్వల్పము. రాజులు దమకీర్తిని ప్రకటించుటకై శాసనముల నిర్మించు నాచార మప్పుడప్పుడె వాడుకలోనికి వచ్చుచుండెను. శాతవాహన రాజుల శాసనముల లల్పసంఖ్యాకములగుటవల వానినుండి వారి చరిత్రసం పూర్ణముగ విశదపడకున్నది. పురాణములయందు ఆంధ్రరాజుల నామములను వారి రాజ్యకాలమును జెప్పబడినను అప్పటి పరిస్థితులను దెలిసికొనుట కవి తోడ్పడవు. ఆంధ్రులనాటి పురములెన్నియో తెలంగాణమున భూగర్భమున డాగియున్నవి, వీనినెల్ల త్రవ్వి పరిశీలించి చూచిన యాంధ్రుల చరిత్రను చక్కగ రచించుట కనుకూలపడును. అంతవఱకు నిప్పుడుపలబ్ధమైన చరిత్రాంశములతో దృప్తిపడవలసి యున్నది.

సాతవాహనులు హిందూ స్వాతంత్ర్యమును నిలువబెట్టి సనాతన హిందూ ధర్మమును గాపాడిరి. వీరికాలమున శకయవన పార్థివాది యన్య జాతులవారనేకులు హిందూదేశమును బ్రవేశించి సురాష్ట్ర మాళవాది రాష్ట్రముల నాక్రమించుకొనిరి. మాళవమున నొక శకరాజ్యమేర్పడెను. దానిరాజధాని యుజ్జయిని. ఈ శకవంశజులు క్షాత్రప మహాక్షాత్రప బిరుదాంకితులగుటచే వీరికి క్షాత్రపరాజులని పేరుకల్గెను. గౌతమీపుత్ర శ్రీశాతకర్ణి క్షాత్రపులనోడించి, వర్ణసంకరముగానీయక హిందూసంఘమును గాపాడెను. శకాములెల్లను హిందూధర్మమునుస్వీకరించి భారతీయులలో గలసిపోయిరి. తర్వాణమున గౌతమీపుత్రుని కుమారుడగు నిమ్మడిపులుమాయి మహాక్షాత్రప రుద్రామునిచే పరాజితుడైనను హిందూసంఘమున కెట్టి కీడును వాటిల్లలేదు. క్షాత్రపులు స్వతంత్రులైనను ఆంధ్రులతో సఖ్యము జేసికొనిరి. రుద్రదాముడు దనకువారిత్తను పులుమాయికిచ్చి పెండ్లిచేసి సంధిచేసికొనెను.

ఆంధ్రశాతవాహన రాజుల కాలమున సముద్రవ్యాపార మభివృద్ధిజెంది పూర్వ సముద్రమందలి యవసువర్ణరమణక ద్వీపములకు రాకపోకలు సాగ నారంభించెను. గుణాఢ్యకృతమైన బృహత్కథయందు దీద్వీపములతో నడచుచుండిన వ్యాపారము చక్కగ వర్ణింపబడియున్నది. ఈ గ్రంథమునందు పై ద్వీపములందు హిందూదేశమునందువలెనే జనులు వర్ణాశ్రమ ధర్మములను పాటించుచుండిరనియు శివవిష్ణ్వాది హిందూ దేవతల కాలయములు నిర్మించి యర్చించుచుండిరనియు దెలియవచ్చుచున్నది. కాంబోజయవసువర్ణ ద్వీపములందు గానవచ్చు శాసనములవల్లను నేటికిని అచట శిథిలావస్థయందు గానవచ్చుచుండు దేవాలయతనములవల్లను గుణాఢ్యుని కథలు కేవలమాకాశపురాణములుగావని తెలుచున్నది. కావున శాతవాహన యుగమప్పటి హిందూ ప్రజలు వలసలు వెడలి పూర్వసముద్ర ద్వీపములందు స్థిరనివాసములేర్పఱచుకొని యచట హిందూధర్మమును సంస్కృతిని నెలకొల్పినట్లున్నది. ఇట్లు వలసలుపోయిన హిందువులు పెక్కండ్రాంధ్ర కర్ణాట దేశములనుండియె బయలువెడలిరనుటకు గొంత యాధారము గలదు. వలస రాజ్యముల ప్రభువులు తమ శాసనములందు శకాబ్దములనె యుదాహరించి ఉత్తరాపథమున వాడుకయందుండినది విక్రమాబ్దము; ద్రావిడ మండలమున శకాబ్దముగాని విక్రమాబ్దముగాని మఱియేకాలమానముగాని వాడుట యాచారముగాదు. ఆంధ్ర కర్ణాట దేశములందు మాత్రము సర్వసాధారణముగ శకాబ్దమే వాడబడుచుండినది. మఱియు బూర్వసముద్రదీపాధిపతులు తమశాసనములన్నిటిని ప్రాచీన తెలుగుకన్నడలిపులయందే వ్రాయించిరి. కావునవలసలుబోయినప్రజలలో నాంధ్రకర్ణాటకుల జనసంఖ్య యధికమై యుండెనని మనమనుకొనవచ్చును. ఆంధ్రులలోనెల్ల కళింగులు సముద్రవ్యాపారమును నడపుటయందును వలస రాజ్యములలో స్థిరనివాసము లేర్పరచుకొనుట యందును ముందంజ వేసినట్లున్నది. కళింగాధిపతినిగూర్చి మహాకవి కాళిదాసుడు తన రఘువంశమున నిట్లు చెప్పి యున్నాడు:

'అసౌ మహేన్ద్రాద్రి సమానసారః
పతిర్మహేన్ద్రస్య మహోదధేశ్చ' అని

మహోదధికి పతియనుటవలన మహేన్ద్రగిరిపై నీతని యధికార మెట్లుసాగుచుండినదో అట్లే మహాసముద్రముమీద ననియునర్థము. అనగా నితనికి నావికాదళముండెననియు దన్మూలమున దనయధికారమును సముద్రముపై జల్లించుచుండెననియు మన మూహింపవచ్చును. మఱియు యవద్వీపమును ప్రాచీనచీనా చరిత్రకారులును గ్రంథకర్తలును కళింగమని పేర్కొనియున్నారు. మలయనులును కాంభోజులును హిందువుల నందఱిని కళింగులని పిలిచెడివారు. కావున తూర్పు సముద్రద్వీపములలో వలసరాజ్యములను నిర్మించి హిందూసంస్కృతిని నెలకొలుపుటయందు కాళింగులు ప్రాముఖ్యమును వహించిరని మనము దృఢముగ బల్కవచ్చును.

ఆంధ్రులు నిర్మించిన రెండవసామ్రాజ్యము విజయనగరము. ఈ సామ్రాజ్య ప్రాముఖ్యమును వెలువరుచుటకు ముందు ఒక విశేషాంశమును వివరించవలసి యున్నది. ఆంధ్రసాతవాహన సామ్రాజ్య మెట్లుత్పత్తినందెనో తెలియదు; తెలియను సాధ్యముగాదు. ఆకాలమును గూర్చి మనకుగల జ్ఞానమత్యల్పము. విజయనగర సామ్రాజ్యము ప్రసిద్ధమాంధ్ర జాతీయోద్యమమునకు ఫలము. భారతీయ భావప్రపంచమున జాతివివేకము ప్రప్రథమమున మహారాష్ట్రదేశమందు శివాజీ యవతారముతో నుప్పతిల్లిన దని మనము చరిత్రలయందు చదువుచున్నాము; ఇందెంత సత్యముగలదో పరిశీలించుటకుగూడ మనకు ధైర్యము చాలదు. ఏలయన మనవిద్యాగురువులైన యాంగ్లేయులు మనకుగ్గున గలిపి త్రాగించిన యుపదేశమది; భారతీయుల కందఱకును విశ్వాసపాత్రమైన గాథయది; కాదన్న నలుగురును నవ్వరా? వెకిలియని వెక్కిరింపరా? ఎవ్వరేమన్న నేమి, నిజమాడవలసిన బాధ్యత ప్రతిచరిత్రశోధకునిమీదను గలదు. వాస్తవమును విచారించి చూచిన

భరత ఖండమందు మనకు తెలిసినంతవరకు మొట్టమొదటి జాతీయోద్యమము ఆంధ్రదేశమున క్రీ. శ ౧౪వ శతాబ్ద ద్వితీయ పాదమున ప్రారంభమాయెను.

ఢిల్లీ మహమ్మదీయ సుల్తానుల ప్రతాపమున కోర్వజాలక దాక్షిణాత్య హిందూరాజ్యములన్నియు కూలిపోయినవి. మొదట దేవగిరి యాదవరాజ్యము క్రీ. శ ౧౩౧౪-౧౮ సం॥న నాశమందెను; కాకతీయ పాండ్య సామ్రాజ్యములు క్రీ. శ. ౧౩౨౩వ సం॥న నంతరించినవి; కంపిలి రాజ్యము క్రీ. శ. ౧౩౨౭వ సం॥న మహమ్మదీయులకు హస్తగతమైనది. ఆ సంవత్సరముననే హొయసలుల ముమ్మడిబల్లాళదేవుఁడు ఢిల్లీ సుల్తాను శరణుజొచ్చి కప్పము గట్ట నియ్యకొనెను. అంతట నాసేతు సీతాచల పర్యంత వ్యాప్తసమస్త భారత భూమండలమును ఢిల్లీమహమ్మదీయ సామ్రాజ్యములోని కంతువ యాయెను. హిందూస్వాతంత్ర్యమెల్లయెడలను నస్తంగతమాయెను. హిందూధర్మమునకు ముప్పువాటిల్లెను. ఆంధ్రభూమండలమున ప్రజలు దిక్కుమాలి భయభ్రాంతులై పోయిరి. వారిస్థితి నామాటలచే వర్ణించుటకంటె నప్పటి వారిచే జెప్పించుటయే యుక్తము.

ప్రతాపరుద్రే త్రిగాంగనానాం లోకాంతరతిథిగోహితే
తురుష్కాంధతమిస్రేణ సమాక్రాంతం మహీతలం॥
ప్రతాపరుద్రేణ పరంపరాప్తా యే పూర్వధర్మా యవనాగ్నిలోను
నోచేత్ప్రతేస్మిన్ యవనైస్సహైవ కథం నిరాబాధసుఖం జజృంభే॥
కేచిద్ధనాఢ్యాః పరిబాధ్యమానా ధనాయ పాపైర్వివిధైరుపాయైః
కేచిన్నిరీక్ష్యైవ చ పారశీకాన్ పర్యస్త్యజన్ ప్రాణమభస్యలోస్యా॥
ద్విజాతయస్త్యక్తసమస్తబంధా భగ్నాశ్చ దేవప్రతిమాస్సమస్తాః
విద్వద్భిర్దత్తైశ్చిరకాల భుక్తాస్సర్వే హృతాపాహరితాగ్రహారాః॥
ఆత్తే కర్షణలాభే పాపైర్యవనైర్బలాత్కారాత్
కీనాశ కుటుంబాః కృషీవలా నాశమాపన్నాః॥

ధనదారాదికే స్వానాం కస్మింశ్చిదపి వస్తుని
స్వాయత్తతా మతిర్నాభూద్భువి తస్యాం మహాపది॥
పేయా సురా గోపిశితంచ భోజ్యం లీలావిహారో ద్విజఘాతనంచ
అశాంతిమాసీద్యవనాధమానాం కథం ను జీవేద్భువి జీవలోకః॥
ఇత్థం తైర్యవనాధమైః పరిబాధ్యమానం త్రైలింగం ధరణీతలం
సురారికల్పైః
త్రాతారం కమప్యప్రాప్య విందమానం సంతాపం వనమివ దా
వ వహ్నిజుష్టం॥

ఇట్లు చెప్పరాని బాధల పాలయిన ప్రజలు కష్టములనుండి విముక్తులగుట కేవలమగుట యంతగాదు. జాతీయోద్యమము ప్రత్యేకమొక్కరి ప్రోత్సాహముచేగాక తనంతటనె పొడమి దేశమంతటను పరవుకొన్నది. క్రీ. శ. ౧౭వ శతాబ్దమున సముద్భూతమైన మహారాష్ట్ర జాతీయోద్యమమునకును దీనికిగల గొప్ప భేదమిదియె. మహారాష్ట్ర జాతీయోద్యమము శివాజీ యొక్కనిపై నాధారపడియుండెను. ౧౪వ శతాబ్దమునాటి యాంధ్రజాతీయోద్యమమునకు సర్వాంధ్ర జనానీకము ప్రాపైయుండెను. మహమ్మదీయులను వెడలనడచి స్వారాజ్యమును మరల స్థాపించినగాని తమకును తమధర్మమునకును సంస్కృతికిని సంరక్షణ కలుగదని అన్నిటికి మించినధర్మము వారు గ్రహించిరి. ఈ ధర్మమునకప్పటి యభిప్రాయము ననుసరించి ప్రధానదృశ్యచిహ్నములు మూడు. దేవతలు. బ్రాహ్మణులు, గోవులు. ఇప్పటి వారికివి నచ్చకపోవచ్చును; గాని యప్పటివారి గాఢ విశ్వాసమది. కావుననే ప్రజల ప్రాపును గోరిన నాయకులందఱును దేవబ్రాహ్మణ గోసంరక్షణకు బద్ధకంకణము గట్టికొంటిమని యుద్ఘోషించిరి. ఓపికగలదేని యప్పటి వెలమరెడ్డి నాయకప్రభువుల శాసనములు దిలకింపుడు; ఈ యంశము మీకు విదితముగాగలదు. ఓరుగల్లు తురుష్కులకు హస్తగతమైన మరుసటి యేటనే స్వతంత్రోద్యమము ప్రారంభమైనది. మొట్టమొదట దక్షిణాంధ్రమున పాకనాటిలో దలచూపినది. నల్లూరి పంటరెడ్డును

ముసునూరి కమ్మనాయకులును ముందంజవేసి సుల్తాను నధికారమును
ధిక్కరించిరి. అచిరకాలముననే దేశమున పేరుగల నాయకులందఱును
వారిచుట్టునుమూగి యేకమైరి. ఆంధ్రజాతీయ సమితి యొకటి యేర్ప
డినది. అప్పటి యాంధ్రులలో దలమానుసు లనదగిన డెబ్బదియేవురు
నాయకు లేకమై ముసునూరు ప్రోలయనాయకుని దమ కధిపతిగ నెన్ను
కొనిరి. ఇట్లు తురక ప్రభుత్వమునకు ప్రతి ప్రభుత్వము రూపందినది.

ఆంధ్రజాతీయ సమితియొక్క ప్రధానోద్దేశములు రెండు. ఒకటి
మహమ్మదీయ విద్రావణము. రెండవది స్వాతంత్ర్య పునః ప్రతిష్ఠ. ఈ
రెండు ఉద్దేశములును సంపూర్ణముగ నెఱవేఱుటకు దాదాపు రెండు
దశకముల కాలము పట్టినది. మహమ్మదీయులతో హోరాహోరిగ
పోరవలసి వచ్చెను. జాతీయసమితి వ్యవహారములందు మూడుఘట్ట
ములు గానవచ్చుచున్నవి. తొలిఘట్టము తీరాంధ్రదేశ దాస్యవిముక్తి
తో ముగిసినది. ముసునూరు ప్రోలయ నాయకుడును ప్రోలయవేమా
రెడ్డియు తక్కిన నాయకులును దమబలములతో తీరాంధ్రమున గాఢం
డిన మహమ్మదీయ రాజ్యములనోడించి తరుమగొట్టి దేశము నాక్ర
మించుకొనిరి. ప్రోలయ నాయకుడు గోదావరీమండలమున తూర్పుక
నుములలోని రేకపల్లెను దనకు ప్రధానస్థానము జేసికొని తెలంగాణ
మును స్వాధీనపఱచుకొనుటకు ప్రయత్నములను బన్నుచుండగా కాలగతి
నందెను. ద్వితీయఘట్టము కంపిలిరాజ్యాక్రమణముతో సమాప్తినంది
నది. చిన్నరాజ్యమైనను కంపిలి దక్షిణపీఠభూమిలో ప్రధానమగుస్థాన
మగుటవలనను పశ్చిమాంధ్రమున చాలాభాగమంత వ్యాప్తమై యుం
డుటవలనను జాతీయదాస్యవిముక్తికొఱకు మహమ్మదీయులతో యుద్ధ
మునకు నడుము కట్టిన యాంధ్రులకు దాని నాక్రమించుకొనుట
యత్యంతావశ్యక మాయెను. ఈ కార్యభారమంతయు దక్షిణతెలంగా
ణమున నల్లగొండ ప్రాంతమున రాజ్యముసేయుచుండిన చాళుక్య
సోమదేవరాజుపై బడినది. తీరాంధ్ర విముక్తికి వంటకమ్మలు కారణ
భూతులైన పశ్చిమాంధ్రమునకు దాస్యము క్షత్రియుల మూలమున

తొలగిపోయినది. సోమదేవరాజు సైన్యముతో బయలువెడలి కృష్ణాతీరమునగా పశ్చిమముఖుఁడై యప్పుడు కంపిలి మండలమునకు ప్రధానస్థానమైన యానెగొందివైపునకు దండయాత్రను సాగించెను. ఆంధ్రజాతీయ సమితి పక్షమున రెడ్డిబల మతనికి తోడ్పడినది. అతనికి దారిపొడుగునను శత్రువులతో పోరాటము కలిగినది; కాని యెల్లచోట్ల నతనికే జయము చేకూడినది. ప్రథమవిజయము నల్లగొండ మండలముందలి నాగులపాటియొద్ద కలిగినది. తరువాత సాతానికోట, ముసలిమడ్గు, కందనవోలు రణక్షేత్రములలో శత్రువులు పరాజయమునందిరి. అటువెనుక కల్వకొలను రాయచూరు యేతగిరి మొదలగు దుర్గములను చిట్టచివర నానెగొందిని యతఁడు కైవసము గావించుకొనెను. సుల్తానుమహమ్మదు బిన్ తుఘ్లాకు శాహుపక్షమున కంపిలి మండలమును పాలించుచుండిన మల్లిక్ మహమ్మదునోడించి చెఱబెట్టి యతఁడు శరణాగతుఁడై యారువేల గుఱ్ఱములను కానుకనిచ్చి వేడుకొనగా నతని విడిచిపెట్టెను.

నరులకసాధ్యమైన ముసలిమడుగు, ధరనెన్నదగిన సాతాని కోటయును
కడునుతింపగఁజాలు కందనవోలు, కడిమిశేషంబుగలకల్వకొలను
అరుదైనరాచూరు నలయేతగిరియు, నిరుపమంబగు గంగిసేని కొండయును
ననఁగ నొప్పారు నీదైనదుర్గముల, వినుతధాటీ మహావేగంబు నొంది
సురపతియోగి యాశుభ్రాంశువంశ, కరుఁడొక్కనాఁడు లగ్గలు గొన్నవాఁడు.
మఱియు నితండాజి మహమ్మదుమలిక, గరకటే యలిగి యగ్గలిక బుట్టించి
బెట్టుకురియాతఁడు బిడ్డపేరిడిన దలకొల్ల దొలగించి దయచేసి కాచె
తెలివి సర్వాది నూఱుతేజీల నచట గలుగు వస్తులతో ద్యాగంబుగా నొసగ్గ,

ఇట్లు ఆ రెడ్డిపీటి వంశావళియందు సోమదేవునికి కీర్తి యొసఁగబడి యున్నది; ఈ విజయములన్నియు నొక్క సోమదేవరాజు పరాక్రమ వల్లనే చేకూరెనని యనుకొనరాదు. పశ్చిమాంధ్ర జనానీకము తోడ్పాటువల్లనే సమస్తమును సాధ్యమాయెను. సుల్తాను ప్రతినిధి యధికారమును ప్రజలు ధిక్కరించిరి; పన్నులుగట్టుట మానిరి; అతని ముఖ్యస్థానమైన యానెగొంది నరికట్టి యాహారపదార్థములను సైతము నందనీయక యడ్డగించిరి. అతని యధికార మెచ్చటను సాగకపోయెను. ఇట్లు నిస్సహాయుఁడైన మల్లిక్ మహమ్మదేమి సేయగలఁడు! ఈ పరిస్థితులయందు సోమదేవునికి సర్వత్ర విజయముగలుగుట యందు వింతయేమికలదు.

తీరాంధ్రము పశ్చిమాంధ్రము లిట్లు స్వాతంత్ర్యమును పొందినవి. ఆంధ్రదేశమునకు హృదయమనఁదగిన తెలంగాణ మింకను తురకల దోలుబడి క్రిందనె యుండెను. ఉద్యమించినకార్యము సంపూర్ణముగ నెఱవేరకముందె ప్రోలయనాయకుఁడు స్వర్గస్థుఁడాయెనని ఇంతకుముందు చెప్పియున్నాడను. ఈపరిస్థితియందు ఆంధ్రోద్యమమున కొకగొప్ప యపాయము పొడ చూపినది. ఢిల్లీనుండి సుల్తాను సైన్యముతోగూడ నెత్తివచ్చి యోరుగల్లున విడిసెను. కాని దైవానుకూలమువలన నీయాపద తనంతటనె పాసిపోయినది. సుల్తాను స్కంధావారమున మారిమసగినది సైన్యమునజాలభాగము మడిసెను. సుల్తానుకు గూడ మారి సోకినది; కాని మరణావస్థకు వచ్చినను అతని చీటి తిరుగబడినది. తేరుకొనెను; కాని రణోద్యోగమును చాలించుకొని వెనుకకుదిరిగి పోవలసి వచ్చెను. ఓరుగంటినుండి తెరలుటకు ముందు మంత్రుల సలహాప్రకారము దక్కనుపైఁ దనయధికారమును నిలుపుకొనుటకు గొన్నిక్రొత్త యేర్పాటులను గావించెను. ఇందు ముఖ్యమైనవియాను: ౧) దేవగిరి పాలకుఁడు దక్కనుకంతటికిని సుల్తానుప్రతినిధిగ నియుక్తుఁడాయెను. ౨) ఆంధ్రదేశము మూఁడుభాగములుగ విభజింపఁబడెను. అ) తూర్పు తెలింగాణ మొకప్రత్యేకమండలము సేయఁబడెను. దీనికి రాజధాని

యోరుగల్లు. క) పశ్చిమ తెలింగాణము మఱియొకటి. దీని ముఖ్యపట్ట
ణము బీదరు. చ) పశ్చిమాంధ్ర దేశముతో గూడిన కంపిలి మూడవది.
దీనిప్రధాననగర మానెగొంది. 3) తూర్పు తెలింగాణమునకును కంపిలికిని
మహమ్మదీయ మతమును స్వీకరించిన నాదేశవాస్తవ్యులనె పాలకులను
గ నియమించెను. ఈ మూడవ యేర్పాటు ముఖ్యముగ గమనింప దగి
నది. స్వదేశాభిమాన మీవాసులంతయు యాంధ్రులలో మిక్కుటము
గానవచ్చుచుండుటవలన పరదేశజులపాలన వారికి గిట్టక పోయెననియు
స్వదేశజులగు మహమ్మదీయులను మండలాధిపతులనుగ నియమించినవారి
పాలనక్రింద ప్రజలు తృప్తులై యణగియుణగియుందురనియు తలచి సుల్తా
నీయేర్పాటును గావించెను. ఈ యేర్పాటు ప్రకారము, తూర్పు తెలిం
గాణమునకు మల్లిక్ మక్బూలును, కంపిలి రాజ్యమునకు సంగమరాజపు
త్రులగు హరిహర బుక్కలును పాలకులుగ నియమింపబడిరి. మల్లిక్
మక్బూలు యొక్క హిందూనామము 'కన్న'; అతడు ప్రతాపరుద్రుని
సుప్రసిద్ధ దండనాయకులలో నొక్కడు. ఓరుగల్లు పతనమునప్పు డితడు
ను ప్రతాపరుద్రునితో గూడ తురుష్కులచే బట్టువడి ఢిల్లీకి చెఱపోయెను.
మార్గమధ్యమున నర్మదాతీరమున ప్రతాపరుద్రుడు స్వచ్ఛమృతి
నందినపిమ్మట ఇతడు మహమ్మదీయ మతమునుస్వీకరించి సుల్తానుప్రే
మకు పాత్రుడాయెను. క్రమక్రమముగ నితడభ్యుదయమునందిసుల్తాను
ఫీరోజుషాహాకాలమున ఢిల్లీసామ్రాజ్యమున కంతటికిని సర్వశిరః
ప్రధానియై ఖానజహానను బిరుదమునంది సుల్తానుపక్షమున సామ్రాజ్య
పాలననడపెను. ఢిల్లీసామ్రాజ్యమున నింతగొప్పపదవికి వచ్చి కీర్తినిగడిం
చిన యాంధ్రుడితడొక్కడే. నాగమన్నమరియే యీ'కన్ను' అని
నాయభిప్రాయము.

హరిహరబుక్కల మహమ్మదీయనామము లెవ్వియో తెలి
యవు. వారు మహమ్మదీయమతమును విసర్జించి హిందూమతమును
మరల స్వీకరించుటచేనేమో మహమ్మదీయ చరిత్రకారులు వీరిని
పేర్కొనక యూరక మూర్తిద్రోహులనిమాత్రము చెప్పిరి. మొట్టమొదట వీరు

ఓరుగంటి ప్రతాపరుద్రమహారాజుకొలువున కోశాగారప్రతీహారులై యుండిరి. ఓరుగల్లు మహమ్మదీయుల వశమైనపుడు వీరు తప్పించుకొని పోయి కుమ్మఠమున కంపిలిరాయల నాశ్రయించియుండిరి. క్రీ. శ. ౧౩౨౭ న కంపిలిని సుల్తాను జయించినప్పుడు వీరతనికి బట్టువడి బలాత్కారముపై దమమతమును త్యజించి మహమ్మదీయమతదీక్ష బుచ్చుకొనవలసిన వారైరి. సుల్తానుయొక్క భయభక్తులతో మెలగుటవలన నతనికి వారియందనుగ్రహము కలిగెను; కంపిలియందు తనయధికారమును సాగించుటకు వారె తగినవారని తలచి నచటికి పాలకులనుగ నియమించి పంపెను.

మహమ్మద్‌బిన్‌తుగ్లకు ఢిల్లీ దక్షిణముపై దన యధికారమును నిలుపుటకు నూతనపద్ధతు నవలంబించినను అతనికోరిక యీడేరలేదు. దీనికి ప్రధానకారణములు ఆంధ్రజాతీయసమితి నాయకాధిపతి శక్తిసామర్థ్యములును, విద్యారణ్యయతీంద్రుని యుదారమంత్రప్రచారపద్ధతులును. ప్రోలయనాయకుని మరణానంతర మాంధ్రనాయకులేకమై యతనితమ్ముని కుమారుడైన కాపయనాయకుని దమ కధిపతిగ నెన్నుకొనిరి. కాపయనాయకు డసాధారణ పురుషుడు. ప్రోలయనాయకుని కంటె శక్తిసామర్థ్యముల యందధికుడు. పోరాటనమును రణప్రవర్తన నైపుణ్యము నటు డనింపు. ఇట్టిగుణములచే విరాజిల్లుచుండిన వారాకాలమున ననేకులు గలరు; రాజధర్మమర్మజ్ఞుడు; అతని దూరదృష్టి యనన్యసామాన్యము. ఆంధ్రనాయకుల దృష్టి సంకుచితమైనది; అది వారి మాతృదేశముయొక్క నాలుగు చెఱగులనుదాటి ప్రసరింపలేదు. కాపయనాయకుని దృష్టి సకలదాక్షిణాత్య హిందూప్రపంచమును ఆవరించినది. తురకల నాంధ్రదేశమునుండి సంపూర్ణముగ దరిమివేయవలయునన్న ఢిల్లీసుల్తానుతో దీర్ఘసంగ్రామము చేయవలసియుండును. అఖిలభారతాధిపతియగు సుల్తానుకుగల బలసంపదలు ఆంధ్రజాతీయసమితికి లేవు. దాని బలపఱచుటకొక్కటే మార్గము కలదు. దానిని సర్వదాక్షిణాత్యసమ్మేళనముగ మార్చుటయే. ఆంధ్రజాతీయసమితి సర్వ

తన భావములను కార్యరూపమున నాచరణకు దెచ్చుట కన్న దాక్షి
ణాత్య హిందువుల అందు ముఖ్యముగ సకల కర్ణాటాధిపతి హోయ్స
లముమ్మడి బల్లాళ దేవుని సహకార మత్యంతావశ్యకము. కావున కాప
యనాయకుఁడు ద్వారసముద్రమునకుఁబోయి బల్లాళరాయనికి నచ్చఁజెప్పి
సంధిచేసికొని దక్షిణభారత దాస్యవిముక్తికి తగునేర్పాటులను గావిం
చెను. ఈ యొడంబడిక ప్రకారము ముమ్మడిబల్లాళుఁడు దాక్షిణ్యహిం
దువులకెల్ల నాయకుఁడాయెను. మఱియు ఆంధ్రదేశమునుండి సంపూ
ర్ణముగ మహమ్మదీయులను దోలివేయుటకు సైన్యసహాయమంపనొప్పు
కొనెను. ఆంధ్రదేశము విముక్తమైన పిమ్మట కాపయయు బల్లాళుఁడు
నేకమై ద్రావిడదేశముపై నెత్తిపోయి యచ్చటి హిందువులకు దాస్య
విముక్తి కలిగింపవలయునని నిశ్చయించుకొనిరి. వీరి సంకల్పము సిద్ధిం
చినది. అనుకొనిన మాట ప్రకారము బల్లాళుఁడు సైన్యమును సాయ
మంపెను; వారి సాహాయ్యముచే కాపయనాయకుడు మహమ్మదీయుల
నెదిర్చి యోడించెను. మల్లిక్ మక్బూలు తెలంగాణమున నిలువజాలక
కాలికిబుద్ధిచెప్పి ఢిల్లీపాలైపోయి తిరిగి[illegible]చెను. తరువాత కాపయనా
యకుఁడును బల్లాళదేవుఁడును నేకమై తొండమండలముపై నెత్తిపో
యి యచటినుండి మధుర సుల్తానును దండముగొట్టి, వెను[illegible]ండ
సాంబువరాయని నా దేశమున కధిపతిగావించిరి. అంతట కాపయనాయ
కుఁడు నిజరాజ్యమునకు మరలివచ్చెను. చోళ పాండ్యమండలముల
నుండి తురకలను బాఱదోలు కార్యము బల్లాళునిమీఁద బడినది.

ఇక కంపిలివైపు దృష్టిని మరల్తము. హరిహరబుక్కరాయలు కంపి
లికి చేరిన వెంటనే వారికి జాతీయనాయకులతో పోరుపొసంగెను; బల్లా
ళుని సహాయమువలన దేశీయసైన్యములు వారికి దుర్నిరీక్ష్యములాయె
ను. మొట్టమొదట వారికి పరాజయము సంభవించినట. అడవుల దిరు
గుచు పంపాక్షేత్రమునకు వచ్చి యచట తపస్సు జేయుచుండిన విద్యా
రణ్య మహామునీశ్వరుని సందర్శించిరి. స్వామివారికి ఆయన్నదమ్ముల
మీఁద ననుగ్రహము గలిగెను. వారికి ధర్మోపదేశముచేసి [illegible]

మహాత్మైన సనాతన హిందూమతమున వారికి మరల నాశ్రయముగల్గిం
చిరి. కృష్ణాసేతు బంధ రామేశ్వరముల మధ్యనుండు రాష్ట్రమంతయు
పంపా విరూపాక్ష స్వామివారి శాసనసూచియనియు, నది యన్యాక్రాం
తమై యుండుటచేత దానిని స్వాధీనపఱచుకొనుట కర్తవ్యమనియు
దెలియజెప్పి స్వామివారిపక్షమున పై రాష్ట్రమును జయించుటకును
జయించినభూమిని పాలించుటకును వారిని ప్రతినిధులనుగ నియమించి
శ్రీభండారమునుండి ఎలసిన ధనమిచ్చి యాశీర్వదించి రాష్ట్రసంపాదన
కంపెను. జాతీయసైన్యములో వీరికి మరల ఘనతకలిగినది. ఈ పర్యా
యము విజయము చేకూరెను. తరువాత పూర్వము కంపిలిమండలము
నకు చెందియుండిన రాష్ట్రమంతయు వశపడినది. తమ విజయసూచక
ముగ క్రీ.శ.౧౩౩౬వ సంవత్సరమున తుంగభద్రా దక్షిణతటమున విరూ
పాక్షస్వామి యాలయము ప్రక్కన విజయనగరమను క్రొత్తపట్టణము
నకు పునాదులు వేసిరి. విజయనగరమునకే విద్యారణ్యస్వామి పేర
విద్యానగరము అనునామాంతరము గలిగెను. ఈ పట్టణముపేరనె హరి
హరబుక్కలును వారిసంతతివారును పాలించిన సామ్రాజ్యము ప్రసిద్ధి
కెక్కెను. మూడువందల యేండ్లకు మించినకాలమది హిందూస్వాతం
త్ర్యలక్ష్మి కాకరమై యుండెను.

విజయనగర రాజ్యమునకు క్రీ. శ. ౧౩౪౩వ సంవత్సరమున
శుక్రదశ ప్రారంభమైనది. ముమ్మడి బల్లాళరాయ లాసంవత్స
రమున తిరుచినాపల్లి రణక్షేత్రమున మధురమహమ్మదీయులకోడి వారి
చే బట్టుబడెను. హొయ్యల సైన్యమంతయు నాశమందెను. తరువాత
వారతని క్రూరవిధిని వధించిరి. అతని పుత్రుడైన నాల్మడి బల్లాళునికి
శక్తిసామర్థ్యములుతక్కువ; దేశమును సంరక్షించుటకు సైన్యములేదు.
నూతనముగ దళములనుగూర్చుకొనుటకు రాజభండారమునధనములేదు.
ఈ పరిస్థితులను చక్కగ నెఱిగినవారగుటచే సమయము కనిపెట్టిహరి
హరబుక్కలు హొయ్యలరాజ్యముపై దండెత్తిరి. విజయనగర రాయ
లు హొయ్యల రాజ్యములను జయింపగడగుటకు రెండు కారణములు
చెప్పవచ్చును. ఒకటి పూర్వవైరము. హరిహరబుక్కలు ఓరుగంటిని

విడిచివచ్చిన పిమ్మట కంపిలిరాయల కొలువుననుండిన విషయము నిచ్చ
ట స్మరణకు దెచ్చుకొనవలయును. హొయ్సల బల్లాళరాయలు కంపిలి
రాయునికి సహజశత్రువు. ఆవైరమే వీరికి సంక్రమించినది. మఱియు
హరిహరబుక్కలు ఢిల్లీనుండి కంపిలరాజ్యమును స్వాధీనము జేసికొన
వచ్చినప్పుడు జాతీయసమితి నాయకులతోగూడ ముమ్మడి బల్లాళుడడ్డు
పడి వారిని రొమాడించియుండెను. రెండవది రాజ్యమును పెంపొందింపవ
లయుననెడి కాంక్ష. కారణమెద్దియైననేమి? క్రీ. శ. ౧౩౪౬వ సంవత్సర
మప్పటికి హొయ్సలరాజ్యము పాడవడగి పోయినది. బల్లాళునియేలు
బడిక్రింద రాష్ట్రమంతయు హరిహరబుక్కలకు హస్తగతమైనది. హొ
య్సల రాజ్యాక్రమణమువలన క్రీ. శ. ౧౩౩౬-౪౬ల మధ్య చిన్నసంస్థా
నమై యుండిన విజయనగరము కృష్ణానదినుండి తొండమండలము సరి
హద్దువఱకును పూర్వసముద్రమునుండి పశ్చిమసముద్ర పర్యంతమును
వ్యాప్తమైన పెద్దరాజ్యముగ పరిణామ మొందినది.

హొయ్సలరాజ్య నిర్మూలమువలన విజయనగరాధిపతులకు
లబ్ధమైనది, వారిరాజ్య మొక్కటియే కాదు. రాజ్యముతోపాటు వారి
రాజకీయాశయములును వైదేశిక వ్యవహార ప్రవర్తనా పద్ధతులును
సంక్రమించెను. ముమ్మడి బల్లాళుని యనంతర మతనిదైన దాక్షిణాత్య
హిందూసంఘ నాయకత్వము దమకు జెందినదనియు దత్కారణమున
హిందూజన సంరక్షణా భారమంతయు దమభుజములపై నానియున్నద
నియు వారు భావించిరి. కావున బల్లాళుడు గతించిన పిమ్మట యల్ప
కాలముననె వారికి మధురసుల్తానులతో యుద్ధము సంప్రాప్త
మాయెను.

ఈ మధుర సుల్తానులనుగూర్చి యొకమాట. ఆంధ్రదేశమున
జాతీయసమితి రూపది తీరా తీరభూమియందు మరల హిందూస్వతం
త్రరాజ్య మొకటి యేర్పడినపిమ్మట ఢిల్లీసుల్తానుపక్షమున సర్వాధికా
రాజధానిగ ద్రావిడదేశములను పాలించుచుండిన మండలాధిపతి తిరుగ

బడి తన స్వాతంత్ర్యమును బ్రకటించెను. అదిమొదలచట యొకస్వతం
త్ర మహమ్మదీయరాజ్య మేర్పడినది. మధురసుల్తానునోడించి పాఱద్రో
లియె ముమ్మడిబల్లాళ దేవుఁడును కాపయనాయకుఁడును తొండమండ
లమున సంబువరాయని ప్రతిష్ఠించినది. మధురసుల్తానుల యేలుబడిక్రింద
హిందువులస్థితి దుర్భరమై యుండినది. దేవాలయములు కూలద్రోయ
బడినవి; యజ్ఞాది వైదికకర్మలాపఁబడినవి; ధనధాన్యాదులు హరింపఁబ
డినవి. హిందువు లనుదినమును నూర్లకొలది నిష్కారణముగ వధింప
ఁబడుచుండిరి. కావున దాక్షిణాత్య హిందూసంఘమునకు నాయకుఁడై
న విజయనగరరాయలకు మధురసుల్తానులతో యుద్ధముతప్పక పోయెను.
యుద్ధము క్రీ. శ ౧౩౪౧ సం॥న ప్రారంభమాయెను; ౧౩౭౦వ సం॥న
ముగిసెను. మధుర తురకలరాజ్యము రూపుమాసిపోయెను; విజయనగ
రరాయలయధికారము కన్యాకుమారి వఱకు వ్యాపించెను. క్రీ.శ౧౩౩౬
చిన్న సంస్థానముగ బొడమి, ౧౩౪౬వ సం॥కు పెద్దరాజ్యముగ బెంపొంది
న విజయనగరము ౧౩౭౦వ సం॥న మహాసామ్రాజ్యముగ మారినది.
విజయనగరరాయలు సకలదక్షిణ భారతభూమికి చక్రవర్తులై మూడు
వందల యేండ్లకు మించినకాలము మహావైభవముతో పాలించిరి. వీరి
చరిత్రము వర్ణించుటకిది సమయముగాదు. హిందూజాతికి వీరొనర్చిన
సేవను సంగ్రహముగనైన చెప్పకతప్పదు

మొట్టమొదట పేర్కొనఁదగినది హిందూస్వాతంత్ర్య నిర్వహ
ణము. స్వాతంత్ర్య స్థాపనకంటె నిర్వహణమే దుష్కరతరమైన కార్య
ము. ముసునూరి నాయకుల యాధిపత్యము క్రింద ఆంధ్రనాయకులును
ప్రజలును నేకమై మహమ్మదీయులను బాఱద్రోలి నిస్స్వాతంత్ర్యమును
నెలకొల్పిరికదా. వారి యభ్యుదయమునకు ప్రధానకారణ మైకమత్య
ము, కాని ఇట్లు నెలకొల్పిన స్వాతంత్ర్యమును వారుదీర్ఘకాలము నిలుప
కొనఁజాలకపోయిరి. కాపయనాయకుని జీవితకాలముననె మహమ్మదీయు
లు తెలింగాణమును ప్రవేశించి గోలకొండయందు ప్రతిష్ఠితులైరి. మఱి
యేబదియేండ్లకు తెలింగాణమంతయు మహమ్మదీయులకు మరలవశ

పడెను. ఆంధ్రులకు స్వాభావసిద్ధమైన విపరీతాత్మాభిమానమే దీనికొక కారణము. ఈ యాత్మాభిమానమువలన ఆంధ్రనాయకులందు వైమత్యము పొడమినది. కాపయనాయకు డాంధ్రజాతీయసమితికి నాయకుడగుటలో తృప్తినందక ఆంధ్రదేశమునకు రాజగుటకు బ్రయత్నించి నట్లున్నది. ఆంధ్రనాయకులందు కొందఱౌదాసీనులైరి. కొందఱు విముఖులైరి. వెలమవారు మహమ్మదీయులకు సహకారులై జాతిద్రోహమున కొడిగట్టిరి. ఈ యంశము ఐకమత్యమువలన నాంధ్రులకు జయమబ్బినది. వైమత్యమువలన దాస్యము చేకూరినది. ఇది యాంధ్రజాతి చరిత్రయందు పదేపదే నిరూపితమగుచున్నది.

ఈ పరిస్థితులలో విజయనగరరాయలు మూడువందల యేండ్లకు మించినకాలము సామ్రాజ్యమును చెడనీయక నిలువబెట్టుట ప్రశంసాపాత్రమే. దేశము శాంతిభూయిష్ఠమైయుండిన సామ్రాజ్య నిర్వహణభారమంత దుర్భరమై యుండకపోయెడిదేమో. సామ్రాజ్యములోని క్షుద్రకంటకుల నటుండనిచ్చి ప్రబలపరమండలేశ్వరులతో డీకొని వారు నిరంతరము పోరాడవలసి వచ్చెను. ఈ తరగతి శత్రువులలో బహామనీ సుల్తానులును వారియనంతరము వారి వారసులనదగు దక్కనీపంచపాదుశాహులును ముఖ్యులు. రాయసామ్రాజ్యము వెలసిన మూడువందల యేండ్లకాలమును ఈ యుద్ధము జరిగినది. ఇది కేవలము రాజ్యకాంక్షవలన కలిగిన యుద్ధముగాదు. రాజ్యకాంక్షతోడు మతాభిమానము గూడ ప్రబల ప్రేరకమైనది. కృష్ణకు దక్షిణమండలి హిందూరాష్ట్రమును జయించి యందు మహమ్మదీయ ధర్మమును స్థాపింపవలయునని బహమనీ సుల్తానుల యొక్కయు పంచపాదుశాహుల యొక్కయు పట్టుదల. మహమ్మదీయులను కృష్ణనుదాటనీయక వెనుకకు దిరుగగొట్టి హిందూస్వాతంత్ర్యమును ధర్మమును గాపాడవలయునని విజయనగరరాయల దృఢనిశ్చయము. రక్కసితంగడి యుద్ధమునకు రాయలు వెడలుటకు ముందు అరవీటిబడే రామప్పయ్యగారాడిన మాటలవలన నరపతిసిం

పాదుషాహులు చివరవఱకును హిందూస్వాతంత్ర్య ధర్మసంస్కృతులను రక్షించుట కొఱకు పాటుపడుచుండిరని విదితమగుచున్నది:

'ముగ్గురు పాదుశాహులును కూడి నామీద తిరుగబడి రాజకార్యక్రమమునకు ఆరంభించి కర్ణాటక దేశమంతటిని స్వాధీనము జేసికొనవలయునని నడచివచ్చుచున్నారు. ఈ దేశమన్ననో ధర్మదేశము. ఈ ధర్మసంస్థానము దేవబ్రాహ్మణుల పాలికి వచ్చినది. దేవస్థానములును, పుణ్యక్షేత్రములును, విద్యావంతులు గలిగిన సింహాసనముమీద వారి యిలాఖా యేలనగువలసి యున్నది? దీనికి నీ అనుగ్రహమువలన కులదేవతల ప్రసాదమువల్లను, బలమునకు ద్రవ్యనిక్షేపములకు ఉండు వారి కందఱికి యెట్టిలోపమున్ను లేదు. సకలసైన్య యుక్తముగ నడచి పోయి శత్రువులను పొడిచి నాశనము చేయుచున్నాను' అని.

ఇట్టి దృఢనిశ్చయముగల వారగుటచేతనే నరపతి సార్వభౌములంత దీర్ఘకాలము మహమ్మదీయులతో ప్రతిఘటించి పోరాడిరి ఈ దీర్ఘసంగ్రామమునకు ప్రధానరణక్షేత్రము కృష్ణాతుంగభద్రల నడిమి యంతర్వేది. ఇచట కర్ణాటాంధ్ర ద్రావిడమహమ్మదీయ రక్తములు కలిసి యేఱులై పాఱినవి. ఇది పుణ్యభూమి. దక్షిణభారత కురుక్షేత్రము—క్షాత్రగాత్రుల కందఱికిని పవిత్రమైన పుణ్యస్థానము. ఇచట తురకలతో పోరి నరపతి సార్వభౌములు మన సనాతన ధర్మమును హిందూధర్మమును చిరస్థాయిని చేసిరి. దక్షిణాపథమున నేడు హిందూస్థానముకంటె స్వచ్ఛతరముగా వెలయుచున్నదని యనేకులు చెప్పుదురు. ఇందెంతేయు వాస్తవముగలదు. ఇదియంతయు విజయనగర చక్రవర్తుల కృషిఫలము. వారి ప్రసాదమువల్లనే నేటివఱకును ఆర్యధర్మము దక్షిణభారతమున నిలువగలిగినది. ఇదియే వారు యావద్భరత ఖండమునకు జేసిన మేలు.

ఇంకొక విశేషాంశమును దెలుపవలసియున్నది. విజయనగరచక్రవర్తులు ఆంధ్రజాతిని దక్షిణభారతమున మూలమూలలకును ప్రసరింప

జేసిరి. కర్ణాటకమునకు బొందు; ద్రవిళ చోళ పాండ్య దేశములకుబొం దు;కొచ్చి తిరువనంతపుర రాజ్యములకుబొందు; తెనుగువారు గానరా ని ప్రదేశములులేవు. వీరిప్పుడు వ్యాపారార్థముగాని యుద్యోగముకొ అకుగాని యాయాస్థలములు దాత్కాలికముగ నివసించువారుకాకు, ఆయాదేశవాస్తవ్యులే. వీరిసంఖ్య పెక్కులక్షలు. వీరు రాయల కాలము న నచటికేగి స్థిరనివాసము లేర్పఱచుకొన్న జనుల సంతతివారు. వీరిమూలమున జాతికలకలయికయు సంస్కృతి సమ్మేళనమును గొంత వఱకు గలిగినది. ఈ యంశమును మఱియొక సందర్భమున విపులముగ జెప్పవలసియున్నది.

ఇంతటితో నీయుపన్యాసమును జాలింపవచ్చును. ఇప్పటికేసుదీ ర్ఘమైనది. మీయోపికయు దఱిగిపోయి యుండవచ్చును; కాని గోల కొండ రాజధానిగ నాంధ్రదేశమున బాలించిన కుతుబుశాహీ సుల్తాను లను గూర్చి ఇంచుక జెప్పవలసిన యావశ్యకత గలదు. కాని ఇందుకొ క యాక్షేపము గలుగవచ్చును. వీరు జాతిచే తురుష్కులు, మత ముచే మహమ్మదీయులు, సంస్కృతిచే పారశీకులు. కావున ఆంధ్రుల యౌన్నత్యమును వివరించు నీయుపన్యాసమున వారిప్రశంస కవకాశ ములేదని యెవ్వరైనను అభిప్రాయపడవచ్చును. జాతిమతాదులచే కుతుబుశాహీ సుల్తానులు ఆంధ్రులు కాదనలేము. భరతఖండమును పాలించిన మహమ్మదీయ ప్రభువులలో గానరాని గుణములు కొన్ని వారియందు కలవు. సాధారణముగ మహమ్మదీయ ప్రభువులెచ్చటను దమ పాలనక్రింద ప్రజలతో గలిసిమెలిసి వర్తింపక తమరాకుపై నీటి బిందువులవలె తొలకియు దాకక నుండువారు; కుతుబుశాహీ సుల్తాను లట్లుకాదు. ఆంధ్రదేశమున రాజ్యముసేయుటచే దాము ఆంధ్రులని భావించిరి. కావున వారిపాలనవిధానమన్య మహమ్మదీయ ప్రభువుల పద్ధతికంటె భిన్నమై ప్రజారంజకమై యొప్పినది. మత విషయములందు దప్ప మఱియెచ్చటను హిందూమహమ్మదీయ భేదమును వారుపాటిం పలేదు. రాష్ట్రపాలనయందేమి, సైన్యమునందేమి, వారిపాలన క్రింద

ప్రజలకందఱికిని వారివారి శక్తిసామర్థ్యముల ననుసరించి యెంతటిగొప్ప
పదవినైన బొందుట కవకాశముండెను. మఱియు రాజ్యములోని
సామంతులును మన్నెదొరలును, నాయకులును బహుళముగ హిందు
వులే. అంతస్తునందేమి నడచుమర్యాదలందేమి వీరికిని మహమ్మదీయ
సామంత ప్రభువులకు నెట్టివ్యత్యాసమును లేదు. శత్రురాజ్యములందు
యుద్ధసమయములలో వారును హిందూ విగ్రహములను జదియగొట్టి
దేవాలయములను ధ్వంసముజేసి వానిస్థానమున మసీదులను నిర్మించినది
వాస్తవమే. కాని వారిరాజ్యమునందిట్టి దారుణకృత్యములను సల్పియుండ
లేదు. దేవాలయాదులందు ఉత్సవాదులను మహావైభవముతో జరుపు
టకు వలసినంత యవకాశము లేకపోయినను మతసంబంధమైన నిర్బంధ
ములు మఱెవ్వియు నుండినట్లు కానరాదు. ప్రతిసంవత్సరమును నూత
న దేవాలయము లెన్నియో నిర్మింపబడుచు వచ్చినవి. వానియందు
దైనందిన పూజాపురస్కారముల నడుపుటకు సర్కారువారు నౌకరులుదాన
ధర్మములు బహిరంగముగ సేయుచుండిరి. మఱియు కుతుబుశాహిప్రభు
వులు విద్యాపోషకులు. సంస్కృతాంధ్రముల నెక్కుడుగ పోషించిరి.
విద్వాంసులను కవులను కళాచతురులను తమయాస్థానమునకాహ్వానిం
చి వారిని తగురీతి నాదరించి సత్కరించిరి. వేదవేదాంగ పారంగతు
లకు అగ్రహారములను వృత్తులనొసగి యజ్ఞాది వైదికకర్మలొనర్చుట
కును వేదశాస్త్రములను విద్యార్థులకు గఱపుటకు వసతులేర్పఱచిరి.
కుతుబుశాహి రాజులలో కొందఱు ఆంధ్రమున కవిత్వము చెప్పనేర్చి
యుండిరి. కుతుబుశాహి సుల్తానులవంటి యుత్తమాశయములుగల
మహమ్మదీయ రాజ్యమింకొకటి కానరాదు. మహాకబ్బరు చక్రవర్తియే
లుబడి యందుగూడ హిందూమహమ్మదీయ ప్రజలు పరస్పర వైషమ్య
ములనుమాని యింతటియన్యోన్యానురాగముతో వర్తిల్లియుండరు. కావుననే
విజయనగర చక్రవర్తులవలె గోల్కొండ పాదుశాహులను ఆంధ్రజాతి
యొక్క స్మరణయందు నేటికిని స్థిరముగ నెలకొని యున్నారు.

# ఆంధ్రులు-చరిత్ర

## ఉపన్యాసము-౨ సంస్కృతి-

**Analysis:**

**VII** మతము:- జైన, బౌద్ధ, శైవ, వైష్ణవములు-
విజ్ఞానము- శూన్యవాదము-
వీరశైవము-ఆరాధ్య-లింగాయత

**I.** సంస్కృతి యనగనేమి- భూగోళము- సంస్కృతి- తెలంగాణము దాని ప్రాముఖ్యము- ఆంధ్రకర్ణాటకముల కూడలి- కర్ణాటక సంస్కృతి ప్రాపకము- దక్షిణాంధ్రము ఆంధ్రద్రావిడముల కూడలి- ద్రావిడ సంస్కృతి ప్రాపకము.

**II.** ఆంధ్రులు వారిభాష- ద్రావిడభాషాసంపర్కము-నూతన భాషల యుత్పత్తి తెనుగు- కన్నడము- తెనుగున కాపేరెట్లుకలిగినది?

**III.** వాఙ్మయము- సంస్కృతము- పరిశోధనావశ్యకత- కాకతీయ విజయ నగరయుగములు విజ్ఞానాభివృద్ధి.

ఆంధ్రము- ప్రారంభదశ- మధ్యదశ- ఉత్తరవిజయనగరదశ ద్రావిడకర్ణాటములలోని ఆంధ్రవాఙ్మయము-

**IV.** లిపి ఆంధ్ర కన్నడ లిపి- పల్లవ గ్రంథము- తమిలు లిపి

**V.** వాస్తు నిర్మాణము చెక్కడము పల్లవులు-చోళులు దేశము చిత్రకళ- అజంత- చిత్తనవాసిల్- తంజావులు-

**VI.** సంగీతము- కర్ణాటక సంగీతము- నాట్యము- నాట్య శాస్త్రము-

# ఆంధ్రులు-చరిత్ర

## సంస్కృతి

నిన్నటి యుపన్యాసమున ఆంధ్రజనానీక మెట్లేర్పడెనో రాజకీయరంగమున ఆంధ్రుల మహాత్వమెట్టిదో సంగ్రహముగ వివరించితిని. ఆంధ్రు లార్యజాతులకు సంబంధించినవారనియు, వారత్తునదీతీరము నుండి వలసవచ్చి దక్షిణాపథమున స్థిరనివాసము లేర్పఱచుకొనిరనియు తరువాత వారచటి తమిళాది యనార్యజాతుల సంపర్కమువలన సంకీర్ణ ప్రజానీకమై పరిణామమందిరనియు దెలిపితిని- మఱియు రాజకీయరంగమున వారు సామ్రాజ్యనిర్మాతలనియు, హిందూధర్మమును సంరక్షించుటకొఱకు మ్లేచ్ఛులతో దరతరము పోరాడుచుండిరనియు, ప్రప్రథమమున జాతీయోద్యమము ౧౪వ శతాబ్దప్రారంభమున నాంధ్రులలో దలచూపెననియు నివేదించుకొంటిని. ఇది నిన్నటియుపన్యాసముయొక్క సారాంశము. నేను భారతీయసంస్కృత్యభ్యుదయమున నాంధ్రులెంతవఱకు తోడ్పడిరో విచారింతము.

మొట్టమొదట సంస్కృతియననేమో వివరించుట యుక్తము. "సంస్కృతి" యనుమాట నూతనకల్పన. సంస్కృతాంధ్రకోశములం దెచ్చటను గానరాదు. ఆంగ్లభాషయందలి కల్చరనుపదమున కది సంస్కృతీకరణము. కల్చరనుమాటకు భారతీయభాషలలో సమానార్థకపదములేదు. కావున భారతీయు లీమాటయందు గర్భితమైన భావమును దేశభాషలలో జెప్పవలసినప్పుడు చిక్కులు పడుచువచ్చిరి. కొందఱీమాటనట్లె యాంగ్లమునుండి గ్రహించి దానికి కలాచారమని సంస్కృతవేషమువేసి తృప్తినందిరి; కాని పెక్కండ్రు ఆంగ్లరూపమును విసర్జించి యందలి భావమును సంస్కృతములోని కనువదించి యా యనువాదమును వాడుకలోనికి తెచ్చిరి. కల్చరనఁగా మూలార్థము

'వ్యవసాయము పెంపొందించుట, ఉత్పత్తి సేయుట' యని. దీనినుండి పరిశ్రమవలన మనఃశరీరాదులను వృద్ధిపఱచుట, శిక్ష, విజ్ఞానవిలసనము మొదలగు నన్యార్థములనేకములు బయలు వెడలినవి. ఇప్పుడు కల్చరనుమాట సామాన్యముగ సర్వవిషయములందును మానవ ప్రయత్నముచే గలిగిన యభివృద్ధి యనునర్థమున గొంచెమించుమించుగ సివిలిజేషనకు తుల్యముగ వాడబడుచున్నది. సకల విషయములందును అభివృద్ధి సంస్కారమువల్లనే కలుగుచున్నది. సంస్కారమనగా చక్కబఱచుట, పరిపూర్ణతగలిగించుట, పెంపొందించుట, మెఱుగుపెట్టుట, నాణ్యమునధికముసేయుట నని యర్థము. సంస్కారమును బొందినది సంస్కృతి. కావున ఆధునికుల నేకులీ నూతనపదమును ఆంగ్లమందలి కల్చరునకు బదులు వాడుచున్నారు. ఈయుపన్యాసమందును సంస్కృతి శబ్దమున కీయర్థమే చెల్లుచున్నది.

భూగోళము—సంస్కృతి:— ఇంతవఱకు నాశక్త్యనుసారము 'సంస్కృతి' శబ్దము చెప్పితిని. ఇక పరిసరములవలన సంస్కృతి పరిణామమునకు విశిష్టత యెట్లుకలుగునో తెలిపెదను. మనుష్యుని మనుగడ చాలవఱకును పరిసరములమీదను వాతావరణపరిస్థితులమీదను నాధారపడియున్నవి. తిను తిండి కట్టుబట్టలు వసించునిలయములు మున్నగునవి స్థలానుగుణ్యముగ మారుచుండును. ఎస్కిమోలు పచ్చిచేపలును పచ్చిమాంసమునల్లే భక్షింతురు; చర్మములను ధరింతురు; భూగర్భమందలి బోఁయలవంటి యిండ్లలో నివసింతురు. వారుండుదేశమెల్లప్పుడును పేర్చిన మంచుచే నాచ్ఛాదితమగుటవలన నచట నేపైరును ఎదుగదు. కావున ధ్రువప్రాంతములనుండు జంతువులను వేటాడియు, సముద్రములోని చేపలనుబట్టియు పొట్టపోసికొనవలసియున్నది. కట్టెల యభావము వలన వండితిననను కూలపడదు. అత్యంతోష్ణదేశముల పరిస్థితులువేఱు. మధ్యాఫ్రికాలోను ఆస్ట్రేలియాలోను నివసించువారికి బట్టలయావశ్యకత లేదు. అనాగరకులనబడు వన్యజాతులవారనేకులింకను దిగంబరులుగనే సంచరించుచున్నారు. ఐరోపాఖండమున, ఉత్తరాసియా ఉత్తరఅమె

రికా ఖండములును శీతలభూములు. అచ్చట పెరుగు ధాన్యములోటు యవగోధుమాదులు. ఇవియే యచటిజనుల ముఖ్యాహారపదార్థములు. చలి దుర్భరమగుటచే వారున్నిబట్టలను కొన్నియెడల చర్మవస్త్రములను ధరింపవలసియున్నది. నివసించుటకచటి స్థితిగతులకనుకూలమైన వసతులను నిర్మించుకొనవలసియున్నది. మన స్థితిగతులువేఱు. మనది యుష్ణదేశము. ఉన్ని చర్మవస్త్రములు మనకు ధరింప శక్యముగాదు. దేహము సోకిన కఱకఱలాడును. నగ్నముగ మనము దిరుగవచ్చును గాని సిగ్గుచేటు. కావున మృదువైన ప్రత్తిబట్టలను మనము కట్టుకొనుచున్నాము. మనదేశమున యవగోధుమాదిధాన్యములు పైరుకావు. వర్షము పుష్కలముగ కురియును; నగులనేకములు సుజలపూరితములై ప్రవహించుచున్నవి. వరి, జొన్న, రాగి, సజ్జ మొదలగునవి చక్కగ పెరుగుచున్నవి. కావున మన ముఖ్యాహారధాన్యములివియే. గృహనిర్మాణము కొఱకు చలిదేశములజనులవలె శ్రమపడవలసినదిలేదు. తలపై నెండవానల కాచ్ఛాదనములుండినచాలును. మన ప్రజానీకమున నూటికి యెనుబదిమంది యింకను పూరియిండ్లయందే నివసించుచున్నారు. ఇందునలన మనమనుగడతీరు చాలవఱకు శీతోష్ణస్థితులవల్ల నేర్పడుచున్నదని తెల్లమగుచున్నది. మఱియు పరసప్రదేశముల నివసించు మన యిరుగుపొరుగు జనులుగూడ మన జీవితవిధానపరిణామమునకు కొంతవఱకు కారణభూతులగుచున్నారు. ఆంధ్రదేశ పర్యంత రాష్ట్రములందు తమిళ కన్నాట మహారాష్ట్రోత్కళ ప్రజలు నివసించుచున్నారని నిన్న చెప్పియున్నాడను. ఇందు మహారాష్ట్రోత్కలులను గూర్చి యిచట విశేషించి వివరింపవలసిన యావశ్యకత లేదు. వారిమూలమున నాయాప్రాంతవాసులగు నాంధ్రుల వేషభాషలయందు కొంతమార్పు కలిగియుండవచ్చును. కాని మన జాతీయ జీవనమున గాఢమైన మార్పులు వారితోటి సంపర్కమువలన గలుగలేదు. దీనికి ముఖ్యకారణము వారిదృష్టి మనయెడ ప్రత్యున్ముఖమై యుత్తరాపథమందు లగ్నమైయుండుటయే. తమిళ కర్ణాటకుల విషయమట్టిదికాదు. వారితో మన

సంబంధము దీర్ఘమైనది, గాఢతమమైనది. తమిళులు కర్ణాటకు లాంధ్ర జాతీయ జీవనమును మార్చినట్లు మఱియెవ్వరును మార్చలేదు. నా భావమును రెండుదాహరణములమూలమున విశదము చేయుచున్నాను; కాని తత్పూర్వమొక మాట చెప్పవలసి యున్నది. శాతవాహనుల కాలమునను దరువాత కుతుబుశాహీ సుల్తానుకాలమందును తప్ప ఆంధ్రజనపద మెప్పుడును నొక్కటే యేలుబడి క్రిందనుండి యుండలేదు. కాకతీయయుగమునగూడ పశ్చిమ దక్షిణాంధ్రములలో కొంతభాగము కళింగమును అన్యాక్రాంతమై యుండినవి. ఒకప్పుడు కర్ణాటకు లాంధ్రదేశము నంతటిని జయించిరి. మఱియొకప్పుడు తీరదక్షిణాంధ్రములను చోళులు జయించిరి. కాని తీరాంధ్ర మన్యప్రాంతములవలె దన ప్రత్యేకతను సంపూర్ణముగ గోల్పోలేదు. ప్రస్తుత విషయ విచారణకొఱకు ఆంధ్రదేశమును మూడు ఖండములుగ విభజింపవలసి యున్నది. 1) దక్షిణాంధ్రము. 2) పశ్చిమాంధ్ర తెలంగాణములు. 3) వేంగీకళింగమండలములు.

1) దక్షిణాంధ్రము:— నెల్లూరు కడప చిత్తూరు మండలము లిందు చేరును. ఈ మూడు మండలములును ద్రావిడ దేశమునాను కొనియున్నవి. వీనికిని తమిళునాటి యుత్తరమండలి చెంగల్పట్టు ఉత్తర ఆర్కాటు జిల్లాలకును జాల సంబంధముగలదు. నెల్లూరుజిల్లా దక్షిణ సీమలందును చిత్తూరు ఉత్తరఆర్కాడు చెంగల్పట్టుజిల్లాలలో ఆంధ్ర ద్రావిడజనులు కలగాపులగముగ కూడి నివసించుచున్నారు. ఇది ఇప్పటి మాట కాదు. అనాదినుండియు నివి భాషాద్వయమండలముగ నుండిన వని యెఱుగవలయును. ఈభాషాద్వయ రాష్ట్రమునకు సహజకేంద్ర స్థానము కాంచీపురము. రాజకీయదృష్టిని చూచినను దీనికొకవిధమైన ఐక్యముగలదు. చరిత్ర ప్రారంభకాలమునుండియు నీ ప్రాంతదేశ మంతయు నొక్కటే యేలుబడిక్రింద నుండినదని చెప్పవచ్చును. మౌర్యయుగము నంగతి మనకు తెలియదు సాతవాహనులకాలమున దీనికి కాంచీపురము

ముఖ్యస్థానమనుటకు గొంతయాధారము గలదు. పల్లవులనాటిమాట చెప్పవలసినదిలేదుగదా. చోళపాండ్యసామ్రాజ్యముల యుత్తరమండలములకు కంచియె ముఖ్యపట్టణము. తెలుగు చోళుల కిది ద్వితీయ రాజధాని. ఇట్లు చరిత్ర పొడవునను దక్షిణాంధ్రోత్తర ద్రావిడ ప్రజలు కలసి మెలసి యేకప్రభుత్వమునకు లోబడియుండిరి. ఈ దీర్ఘసంబంధము వలన వారి కొకపాటి ప్రత్యేకత గలిగినది. ఆంధ్ర ద్రావిడ ప్రజల మనోభావములను దలపోసి చూచుకొనుటకు చక్కని యవకాశమేర్పడినది. తన్మూలమున నాంధ్రసంస్కృతియందు ద్రావిడ ఛాయలు పొడసూపినవి; అట్లే ద్రావిడ సంస్కృతి కాంధ్రసంసర్గ మనివార్యమాయెను.

౨) పశ్చిమాంధ్ర తెలంగాణములు:— ఇవి చిరకాలము కర్ణాటాంధ్రముల కూడలి ప్రదేశములై యుండినవి. దక్షిణాంధ్రముకంటె నివి వైశాల్యమున జాల పెద్దవి; కావున సరిహద్దు సీమలయందు దప్ప ప్రజాసమ్మేళన కంతగ నవకాశములేకపోయినది. కాని ఇవి చిరకాలము కర్ణాటకములో గలసి ఏకరాజ్యమై యుండినవి. సాతవాహనుల యనంతరము దక్షిణాంధ్రమువలె పశ్చిమాంధ్ర కర్ణాటకములును పల్లవుల యధీనముందుండినవి. కాని క్రీ. శ. ౪,౫వ శతాబ్దములందు నుత్తర కర్ణాటమున కదంబరాజ్యమును, దక్షిణకర్ణాటకమున పశ్చిమగాంగరాజ్యమును ఏర్పడినవి. మొదట నివిపల్లవులక్రింది సామంతరాజ్యములై యుండినను క్రమక్రమముగ స్వతంత్రసంస్థానములాయెను. సాతవాహనుల పిమ్మట తెలంగాణము నెవ్వరు పాలించిరో తెలియదు. క్రీ. శ. మూడు యేడుశతాబ్దములమధ్యకాలమును తెలంగాణచరిత్రయం దజ్ఞాతయుగమని చెప్పవలసియున్నది. భావి పరిశోధనల మూలమున క్రొత్త సంగతులు తెలియవచ్చును. అజ్ఞాన తిమిరము బెడబాయుటవలన ఈకాలపు తెలంగాణ చరిత్రను రచించుటకు సాధ్యము గావచ్చును. క్రీ. శ. ౭వ శతాబ్దములో దక్షిణదేశ చరిత్రయందొక నూతనయుగము ప్రారంభమగుచున్నది. చాళుక్యులు దాక్షిణాత్యభూపాలుర నెల్లరను జయించి కప్పముగొని సకల దక్షిణాపథమునకును సార్వభౌములైరి. చాళుక్య

లాద్యమున ఆంధ్రపథమందలి హిరణ్యరాష్ట్ర (అనగా నిప్పటి కడపమండలములోని జమ్మలమడుగుతాలూకా) వాస్తవ్యులని ఇంతకుముందు చెప్పియున్నాను. ఇది క్రీ. శ 3, 4 శతాబ్దములనాటిమాట. తరువాత మొదటి పులకేశి క్రీ. శ. 543వ సం॥న ఇప్పటి విజాపుర మండలములోని బాదామిదుర్గమును సాధించుటను చాళుక్యులనుగూర్చి మనకేమియు తెలియదు. ఇతని పుత్రుడగు మొదటికీర్తివర్మ పెక్కుదేశములను జయించినట్లితని తమ్ముడగు మంగళేశుని శాసనములందు జెప్పియున్నది. ఇదెంత సత్యమో యతిశయోక్తియెంతయో నిర్ణయించుటకు సాధ్యముగాదు. ఈ విజయములన్నియు వాస్తవములైనచో చాళుక్యసామ్రాజ్యమునకు అస్థిభారము వేసినవాడు మొదటికీర్తివర్మయని చెప్పవలసియున్నది. ఇతడు జయించిన ప్రజలలో మౌర్యులును కదంబులునలులునుముఖ్యులు. మౌర్యులుకొంకణమునగోవాప్రాంతమును పాలించుచుండిరి; కదంబులు వైజయంతి రాజధానిగ ఉత్తర కర్ణాటము నేలుచుండిరి. నలులు ఏ ధర్మశాఖకు చెందినవారు. వీరి మూలస్థానము కర్నూలు మండలములోని నలవాడి విషయము. అర్వాచీనకాలమున దీని నేలవాడి యని చెప్పువారు. నలుల యధికారము తెలింగాణముపై వెల్లుచుండె ననుటకు కొంత యవకాశము గలదు. ఇప్పటి హైదరాబాదు రాజ్యములోని నలగొండ నలదుర్గము మొదలగు స్థలములు వీరి నామమును స్మరణకు దెచ్చుచున్నవి. నలగొండ యన నలవిషయములోని కొండయనియు నలదుర్గమన నలుల దుర్గమనియు నర్థముజేసికొనవలయును. ఈయభిప్రాయము సరియైనదేని మొదటికీర్తివర్మ ఉత్తరకర్ణాట కొంకణములతోపాటు తెలంగాణమునుగూడ జయించెనని యూహింపవలసియున్నది. యీ యూహ సరియైనదని యెంచుటకు కొంతఅవకాశముగలదు. ఇమ్మడిపులకేశివల్ల ఘనికాలమున తెలింగాణము చాళుక్యుల యేలుబడిక్రింద నుండెను. అతడు మహారాష్ట్ర కోసల వేంగి కళింగములను పల్లవుల పాలనయందుండిన పశ్చిమాంధ్రమున చాలభాగమును జయించెనే కాని తెలంగాణమును జయించి వచ్చె

టను జెప్పియుండలేదు. అతనికి ముందు ప్రభుత్వము చేసిన మంగలేశుడును తెలంగాణమును సాధించెననుట కాధారములేదు. కావున తెలంగాణమును జయించినాతడు మొదటికీర్తివర్మయే యని మన మనుకొనవచ్చును.

ఇట్లు బాదామి చాళుక్యరాజుల ప్రభుత్వమున కర్ణాటమునకును పశ్చిమాంధ్ర తెలగాణములకును పొత్తు కుదిరినది, ఇది మరల చెడలేదు. రాజులు గతించిరి. రాజవంశములు మారినవి, అసఫియావంశస్థాపనవఱకును అవిచ్ఛిన్నముగ సాగినది. చాళుక్య రాష్ట్రకూట కాలచుర్య ప్రభువు లీసంబంధమును జెడనీయక కాపాడిరి. తరువాత నంతరాయము లప్పుడప్పుడు గలుగుచువచ్చినను బహమనీసుల్తానులును మొగలాయి చక్రవర్తులును మరల దీనిని పునరుద్ధరించిరి. నేటికిని ఈ సంబంధము సంపూర్ణముగ విచ్ఛిన్నముగాలేదు. తెలంగాణము సర్వమును ఉత్తర కర్ణాటమున గొంతభాగమును హైదరాబాదు రాజ్యమున నొక యేలుబడి క్రిందనే యున్నవి. చిరకాల సంబంధమువలన నిచటి ప్రజలు భాషాభేదములను పాటింపక కలసిమెలసి యున్నారు. ఈ కలయిక మూలమున ఉభయసంస్కృతులును చక్కగ సమ్మేళము నంది నూతన మార్గముల బ్రవర్తిల్లినవి. ఈవిషయమును మరల నింకొకతావున విశదపరచెదను.

3) వేంగికళింగములు:- ఈ రెండుదేశములు క్రీ.శ. ౭వ శతాబ్ద ద్వితీయపాద ప్రారంభమున ఇమ్మడిపులకేశిచే జయింపబడినను అవి తమ వ్యక్తిత్వమును గోలుపోలేదు. ఇమ్మడిపులకేశి ఈరెండుదేశములను దనతమ్మునికి కుబ్జవిష్ణువర్ధనున కిచ్చి యతనిని అతని సంతతివారిని వంశపారంపర్యముగ నచట రాజ్యము జేసికొండని నియమించెను; కావున నీ రెండుదేశములును చాళుక్యసామ్రాజ్యమున గలిసిపోక ప్రత్యేక రాజ్యమైనవి. కుబ్జవిష్ణుని అతని సంతతివారిని బాదామి చాళుక్యులనుండి వేర్పరచుటకొఱకు చరిత్రకారులు పూర్వచాళుక్యులని వానికి నామకరణము గావించిరి. మొట్టమొదట పూర్వచాళుక్యులని

దృష్టియందేయు కర్ణాటకమందే లగ్నమై యుండినది. వేలుచుండిన దాంధ్రభూమియందైనను, తాము కర్ణాటకులమనియె వారు తలచుచుండిరి; కర్ణాటక భాషనె మాటాడుచుండిరి. కర్ణాటకాచారములనె యనుష్ఠించుచు వచ్చిరి. క్రీ. శ. ౮ వ శతాబ్దమధ్యమున బాదామి చాళుక్యుల యాధికారమును గూలద్రోసి రాష్ట్రకూటులు కర్ణాటాధిపతులైరి. వారు వేంగీకళింగములు కర్ణాట సామ్రాజ్యాంతర్భాగములనియెంచి వానిని జయింప దలపెట్టిరి. తమ వంశమునకు సహజశత్రువులగు రాష్ట్రకూటులను ధిక్కరించి యెదిర్చిరి. క్రీ. శ. ౭౭౦ వ సం॥న ప్రారంభమైనది. రాష్ట్రకూటుల యధికార ముండునంతకాలమును జరిగినది. ఒకప్పుడు వీరికిని మఱియొకప్పుడు వారికిని జయము గలుగుచు వచ్చినను వేంగీకళింగములు రాష్ట్రకూటులకు వశపడలేదు; కాని వారు పట్టుపట్టును వదలక తీరాంధ్రమును రణరంగముగ మార్చి దేశక్షోభను గలిగించుచువచ్చిరి. తత్కారణమున పూర్వచాళుక్యులకు కర్ణాటకులపై దీఱనిపగయు నేవగింపును గల్గినది. తాము కర్ణాటకులమని తలచుటకుగూడ వారికి మనసొప్పలేదు. తమప్రజలతో నేకీభవించి తాము ఆంధ్రులమనియె యనుకొనదగిరి. ఇట్లు పొడమిన కర్ణాటద్వేషము పూర్వచాళుక్య వంశమంతరించిన పిదప సమసిపోలేదు. ఇదియె యాంధ్రాభ్యుదయమునకు గారణభూతమైనది.

తె[illegible] స్పష్ట[illegible] సంస్కృతి [illegible] మును [illegible] ; [illegible] పరిణా[illegible] ము[illegible] ; [illegible] ధసంస్కృతికే [illegible] ము [illegible] నో [illegible] ఇక సాంధ్రసంస్కృతి వి[illegible] ను. ఇప్పుడు మొట్టమొదట [illegible] ఆంధ్ర దేశము. నిప్పుడు వాడుకయందున్న భాష తెలుగు [illegible] తెనుగు అనుపేర బరగుచున్నది. ప్రాచీన [illegible] స్థలనామముల బట్టి చూడ క్రీ.శ. [illegible] శతాబ్దములనుండి తీరాంధ్రమున నీభాష మాటలాడబడుచుండి

నట్లున్నది; కాని ఇది యాంధ్రులభాషయా ? అనునది విచారణీ
యాంశము. సాతవాహనయుగమున తెనుగుభాష వాడుకయందుండె
ననుట కాధారములు లేవు. గుణాఢ్యుని బృహత్కథయందు సాతవాహన
రాజ్యమున జనులకు పరిచితమైన భాషలు పేర్కొనబడియున్నవి.
ఇవి మూఁడు: సంస్కృతము, ప్రాకృతము, దేశభాష; ఇవి
మూఁడును గాక పైశాచియొకటి గలదు. ఈభాష యందే గుణాఢ్యుఁడు
తన బృహత్కథను వ్రాసినది. కాని యిది సంస్కృత ప్రాకృత దేశ
భాషలవలెజనులకు పరిచితమైనది కాదు. ఏలయనఁగా, గుణాఢ్యుఁడు సాత
వాహనునియెదుట శర్వవర్మతో నిట్లు ప్రతిజ్ఞ చేసెను. 'నీవేగనుక ప్రభువు
నకు ఆఱునెలలలో పాండిత్యము గలిగింతువేని నేను మనుష్యవ్యవహార
ములోనుండువానిని సంస్కృతము ప్రాకృతము దేశభాషయను నీ
మూఁడుభాషలను త్యజించినాఁడనని తెలిసికొనుము'. ఇందువలన సాత
వాహనుని కాలమునప్పటికే పైశాచి మనుష్యవ్యవహారంలో లేకపోయిన
దని తెల్లమగుచున్నది. అప్పుడు వ్యవహారములో నుండిన మూఁడు భాష
లలో నొకటియగు దేశభాష తెలుగు కాఁగూడదా యను సంశయము
మనకు కలుగవచ్చును. ఆ దేశభాష తెలుఁగే కావచ్చును.
కాని యట్లని దృఢముగా చెప్పుటకు వీలులేదు. ఏలనఁగా నిన్నటి
యుపన్యాసమున తెలుగువారివలె కర్ణాటకులును ఆంధ్రజాతిలోనివారని
జెప్పియున్నాను. తెనుగునకంటె కన్నడము ప్రాచీనతరము. కావున ఆ దేశ
భాష కన్నడ మేల కాఁగూడదు ? అను ప్రశ్నకు సరియైన సమాధానము
లేదు. మరియు ఆధునిక మహారాష్ట్ర పరిశోధకులు కొందఱు, 'ఇప్పటి
యాంధ్రులకును ప్రాచీనాంధ్రులకును సంబంధములేదు. మహారాష్ట్రులే
ప్రాచీనాంధ్రుల సంతతివారు' అని యార్భటించుచున్నారు. వీరి యార్భట
ము సత్యముపై నాధారపడినదని తలచితిమేని ఆ దేశభాష మహారాష్ట్ర
మైనది కావచ్చును, ఇచట నొక ముఖ్యాంశమును పరిశీలింపవలసియున్నది.
'తెనుఁగు' లేక 'తెలుఁగు' అను మాట ప్రప్రథమమున క్రీ. శ. ౧౦వ
శతాబ్దముననే కానవచ్చుచున్నది. తత్పూర్వము దానిజాడ యెచ్చ
టను కానరాదు. పదియవశతాబ్దమునకు ముందు శాసనములందు ను

సంస్కృతప్రాకృతవాఙ్మయములందును 'ఆంధ్ర' 'అంధ' నామములె వాడుకయందుండినవి. తెనుఁగు అనుమాట యే మృగ్యమైనపుడు సాతవాహనయుగమున తెనుఁగుభాష యుండెనని కాని గుణాఢ్యునిచేఁ పేర్కొనబడిన దేశభాష యదియే యనికాని వాదించుట సమంజసము కాదుగదా.

మఱి యాంధ్రు లాడినభాష యేది ? అది గుణాఢ్యుల పేర్కొనిన దేశభాషకారాదా యను నాశఙ్క కలుగనచ్చును. ఆంధ్రులు కొందఱు పాశ్చాత్య పరిశోధకులు చెప్పునట్లు ద్రావిడజాతివారైన గుణాఢ్యునిచే బేర్కొనబడిన దేశభాష వారి భాష యే కావచ్చును. కాని వారు ఆక్సుసునదీ తీరమునుండి దక్షిణాపథమునకు వలసవచ్చినారనియు; తుషారమో లేక తత్సదృశమైన మరియొక యార్యభాషనో మాటలాడు చుండిరనియు నిన్నటియుపన్యాసమున జెప్పియున్నాడను ; కావున వారాడుచుండినది గుణాఢ్యుఁడు పేర్కొనిన ప్రాకృతభాషయైయుండును. ఆంధ్రులు దక్షిణాపథమునకు వచ్చినప్పుడచటి జనులయందు వ్యవహారము నందుండినభాష యే గుణాఢ్యుఁడు చెప్పిన దేశభాష. ఈ దేశభాష స్వరూపమెట్టిది ? అనునది ఇఁక విచారింపదగిన విషయము. ఈ ప్రశ్నకు నిశ్చయమైన సమాధానమును చెప్పుటకు వలనుపడదు. ఏల యన వాస్తవమును నిర్ణయించుటకు దగిన యాధారములు లేవు. అర్వాచీన కాలమున నాంధ్రదేశమున వాడుకయందుండిన భాష నాధారముచేసి దీని స్వరూప మిట్టిదే యుండునని యూహించి తృప్తినంద వలసియున్నది. ఆధునికభాషా శాస్త్రజ్ఞు లందఱును అవలంబించిన పద్ధతి యిదియే. పద్ధతియొక్కటి యైనను వారి సిద్ధాంతము లొకతీరున నుండక భిన్నములై యున్నవి. మన భాషా శాస్త్రజ్ఞులను వారి సిద్ధాంతముల ననుసరించి మూడు తెగలుగ నేర్పరచవచ్చును. మొదటి తరగతివారు తెనుగు ఆర్యభాషా కుటుంబమునకు జెందినదనియు సాక్షాత్తుగ సంస్కృతమునుండి కాకపోయినను మరియే ప్రాకృతమునుండియైన నుత్పత్తియైయుండుననియు వాదింతురు. నన్నయభట్టు మొదలగు మన

ప్రాచీనవైయాకరణు లందఱును సంస్కృతప్రాకృతము లాద్యప్రకృతి యనియు, తెనుగుభాష వానియొక్క వికృతియనఁగా వానినుండి పుట్టిన దనియువీరియభిప్రాయమువెలిబుచ్చియున్నారు. కావున తెనుఁగుప్రాకృత భవమని వాదించు ఆధునికభాషాపరిశోధకవర్గము నన్నభట్టారకాదుల మార్గమునె యవలంబించిరనుట తప్పుకాదు. ఇంకొక తెగ పరిశోధకులు తెనుఁగు తమిళిమునుండి యుత్పత్తినందెనని చెప్పుదురు. వీరి యభిప్రాయము సంపూర్ణముగ విసర్జనీయముగాదు ; కాని పెక్కండ్రు కిది నచ్చదు. ఆంధ్రులు దక్షిణాపథమునకు వచ్చినప్పు డచట వాడుకయందుండినది తమిళము గాదు. సర్వద్రావిడభాషలకును తల్లియన దగు ప్రోటోద్రావిడభాషయచట వ్యవహార ముండుండినది. దానినుండి కాలక్రమమున తమిళి కన్నడ తెలుగు మళయాళ తుళుభాషలుత్పత్తియైన వని చెప్పుదురు. సంస్కృతికదృష్టితో పరికించితిమేని పై రెండు సిద్ధాంతములకుగల పరస్పరభేద మంతగ పరిగణింపదగినదికాదు. ముఖ్యముగ విచారింపవలసినది వాని యుత్పత్తికి కారణము. తమిళముగాని ప్రోటోద్రావిడభాషగాని ఇప్పటి దాక్షిణాత్యభాషలుగ పరిణామ మందుటకు గారణమేమి ? ఈ ప్రశ్నకు ఆర్యుల సంపర్కమువల్లనని సాధారణముగ జవాబు చెప్పుదురు. కావచ్చును ; మరి యీ సంపర్కమువలన నొక నూతనభాషగాక పెక్కేర్పడుటకు కారణము విచారించిన దానికెవ్వరును సమాధానము చెప్పరు. ఆర్యుల సంపర్కము వలన అనుటకంటె ఆంధ్రులసంపర్కమువలన అని చెప్పుట యుక్తము. ఆంధ్రులు దక్షిణదేశమునకు వచ్చినప్పుడు పశ్చిమభాగమునకంటె నధిక సంఖ్యాకులు తూర్పుభాగమున నివాసము లేర్పఱచుకొనిరి. దీనికి గారణము లేకపోలేదు. తూరుపుభాగము పశ్చిమముకంటె సమతలమై దూరుపున ముఖ్యముగ తీరప్రదేశమున—భూమి విశేషముగ ఎగుడుదిగుడు లేక సమతలమై యుండుటచేతను, గోదావరీ కృష్ణా పినాకిన్యాదు లీసమతల దేశముగుండ ప్రవహించి సముద్రమున బడుటచేతను యచటినేలపై మండలి పేరి బహుసారవంతమై పుష్కలజలవసతిగలిగి వ్యవసాయమున కత్యంత మనుకూలమైయున్నది, ఈ కారణమువలన ఆంధ్రులు బహు

సంఖ్యాకులిచట నివాసముల నేర్పరచుకొనిరి ; కావున అచట వాడుక యందుండిన దేశభాషలో వారి పలుకుబడికి ప్రాముఖ్యము గలిగినది. సంస్కృతప్రాకృతశబ్దజాల మందధికముగ ప్రాకినది. తూరుపుకంటె పడమటభూమి విషమతరము. పర్వతారణ్యము లధికము. భూమి సారవంత మైనది కాదు. నీటివసతి తక్కువ. వ్యవసాయము కష్టసాధ్యము. మరియు నిప్పటి మైసూరుప్రాంతదేశము ద్రావిడభూయిష్ఠమై యుండెనని ప్రాచీన[illegible]వాఙ్మయమువలనఁ దెలియవచ్చుచున్నది. కావున ఈ ప్రాంతమునకు వలసవచ్చిన యాంధ్రులసంఖ్య యల్పము. దేశభాష యందు వారి [illegible] పూర్వదేశమున [illegible] గలిగినంతటి ప్రాధాన్యము లేకపోయె. [illegible] సంస్కృతప్రాకృతశబ్దములకంటె ద్రావిడపదములకే [illegible] దేశభాష సంస్కృతప్రాకృతములసంప[illegible] ఆంధ్ర[illegible] పశ్చిమమున హాళకన్నడమను రెండు నూతనభాషల యుత్పత్తికి [illegible]భూతమైనది. ఆంధ్రద్రావిడ స[illegible] [illegible] భాషా[illegible]పంచము విరివినందినది.

[illegible] సంస్కృత[illegible]ము [illegible]చే దేశభాష[illegible] [illegible] యంటిమిగదా. ఇ[illegible] తెనుగు. ఆంధ్రము తెనుఁగనుచో దీనికి నామాంతర[illegible] [illegible]వాడుకయందున్నది. దీనికి కారణము పలువురు పలువిధముల వివరింతురు. కొందరిది త్రికళింగ శబ్దభవమని వక్కాణింతురు. ప్రాచీనకాలమందు క్రీ. శ. ప్రారంభశతాబ్దులలో కళింగ దేశమును పాలించిన ప్రభువులు తాము త్రికళింగాధిపతుల మని చెప్పుకొనిరి. త్రికళింగములనఁగా మూఁడుకళింగము లని అర్థము కళింగ మప్పుడు మూఁడు భాగములుగ విభక్తమైయుండినది. ఈ మూఁడుభాగములు కలిసియుండిన దేశమునకే త్రికళింగ మనిపేరు. ఈ దేశమున వ్యవహారమునందుండిన భాషకుగూడ త్రికళింగమని పేరుగలదనియు నాపేరు క్రమక్రమముగ త్రిలింగమై, త్రిలింగమై, తెలుంగమై తెలుఁగైనదనియు చెప్పుదురు. ఇది యంతయు నేలను విడిచిన సాము[illegible]

లింగ మనుపేరిటి భాషయొకటి యుండెనని కాని, యది పై జెప్పిన రూపాంతరములనంది తుదకు తెలుఁగై పరిణామ మందెనని చెప్పుటకు గాని యెట్టియాధారమునులేదు. మఱికొందఱు ఆంధ్రద్రావిడభాషల సంయోగమువలన హళెకన్నడము తెళిగన్నడమను రెండుభాష లుత్పత్తి యాయెననియు దెలిగన్నడముయొక్క పరిణామమె తెలుగనియు వివరింతురు. హళెకన్నడమన ప్రాతకన్నడము. ఇది యర్వాచీన కర్ణాటకులు తమ కాలమున వ్యవహారముననున్న కన్నడమును ప్రాచీనభాష నుండి వేర్పఱచుకొనుటకు వాడినమాట. కాబట్టి ప్రాచీన కన్నడిగలు తమభాషను కన్నడ మనియేయుందురుగాని హళెకన్నడమనియుండరు. తెళిగన్నడ మనుమాట గగనకుసుమము. తెలుఁగునకు ప్రాచీనతగల్గించుటకు మన భాషాశాస్త్రపరిశోధకులు కల్పించినమాట. ఇటీవల కొందఱొక నూతనసిద్ధాంతమును ఉపపాదించియున్నారు. 'ఆంధ్రులు వేఱు, తెలుగలువేఱు. ఆంధ్రులు తెలుఁగుదేశమును జయించి దానికధిపతులైనను, తెలుఁగుభాష యాంధ్రమును ద్రింగిజీర్ణము చేసికొనెను'. అని ఇది కేవలము సత్యాన్వేషణపరులు తమ పరిశోధనలఫలితముగ బ్రతిపాదించిన సిద్ధాంతముగాదు. ఆధునికజాతివైషమ్యాత్మకములగు రాజకీయాభిప్రాయములకు ప్రాచీనతను గల్పించుటకు చేసిన పన్నాగము. వీరు చెప్పున దంతయు సత్యమైయేని యుండిన మనభాషకు తెలుగను పేరాద్యమునుండి యుండవలయునుగదా; క్రీ. శ. ౧౦ వరకును 'తెలుఁగు' అను మాటయే లోకవ్యవహారము నందుండెననియనుకొనుటకుగూడ సాక్ష్యములేదే. ఇట్టియెడ వీరి సిద్ధాంతమును అంగీకరించుటకు వీలెట్లగును?

కాని వీరి సిద్ధాంతమున ఇంచుక సత్యము లేకపోలేదు. మన భాషకు తెలుగనుపేరు తెలుఁగుజనులవల్ల కలిగినదనుట వాస్తవదూరము గాదు; కాని ఇంతవరకు లబ్ధమైన సాక్ష్యమును బట్టిచూడగా తెలుగభాష కాపేరు క్రీ. శ. ౧౦వ శతాబ్దము తరువాతనే కలిగెనని చెప్పవలసి యున్నది. ఏలనఁగా తెలుగు అనుమాట మొట్టమొదట

చోళచక్రవర్తుల శాసనములందే కానవచ్చుచున్నది. క్రీ. శ. ౧౦౧౨ వ నాటి మొదటి రాజరాజయొక్క పుదుక్కోట సంస్థానములోని నార్తా మలై శిలాశాసనమున తెలుంగకులకాల పురమను గ్రామమొకటి పేర్కొనబడి యున్నది. రాజరాజునకు తెలింగకులకాలన్ అను బిరుదు కలదనియు దానిబట్టియే ఆ గ్రామమున కాపేరు కలిగినదనియు చరిత్ర కారుల యభిప్రాయము. క్రీ. శ. ౧౦ ౨౧ లో ప్రథమ రాజేంద్రచోళ చక్రవర్తి ౧౦ వ రాజ్యవర్షమున వ్రాయించిన అనంతపురంజిల్లా మడక శిర తాలూకా కొత్తశివారగ్రామ శిలాశాసనములలో నొకదాని యందు తెలుంగులు పేర్కొనబడి యున్నారు; మఱియు నతని సేనాధ్యక్షులలో నొక్కరైన విక్రమచోలు చోటియవరై య్యనను నతఁడు కళింగులను, ఒడ్డెలను, తెలుంగులను జయించి నట్లున్నది. క్రీ. శ. ౧౦౪౬ న వ్రాయించిన మొదటి రాజాధిరాజు మణిమంగళ శిలాశాసనము తెలుంగ విజ్జయుఁడు పేర్కొనబడి యున్నాడు. నేనెఱింగి నంతవఱకు తెలుగును బేర్కొను ప్రాచీన తమ శాసనములీ మూఁడే. సమకాలి కాంధ్రవాఙ్మయము వలన శాసనసాక్ష్యము రుజుగువ చున్నది. ఆంధ్రకవులలో నాద్యుఁడనఁదగిన నన్నెచోడదేవుఁడు తెనుఁగు భాషను దన కుమారసంభవమున బేర్కొనియున్నాఁడు; నన్నయ భట్టారకుఁడుగూడ వ్యాసకృత సంస్కృత మహాభారతమును దాను తెనుగున ననువదింప దలపెట్టితినని చెప్పియున్నాఁడు, ఇందువలన క్రీ. శ. ౧౧ వ శతాబ్దమప్పటికి ఆంధ్రులకును వారిభాషలకును తెలుగు నామము రూఢిపడియెనని మనము దృఢముగ జెప్పవచ్చును. ఈ మార్పుగలుగుటకు కారణమేమో తెలియదు; కాని మొట్టమొదట నిది యాంధ్రదేశమందలి యొక ప్రాంతమునకును దత్ప్రాంతవాసులకును పేరై యుండి తరువాత ఏకారణములవల్లనో యర్థవిస్తృతినిబొంది యావదాంధ్రభూమికిని ప్రజలకును వారిభాషకును నభిధానమై మారి నట్లు తోచుచున్నది. క్రీ. శ. ౧౪ వ శతాబ్దప్రారంభమున వెలసిన మేరుతుంగుఁడు తనయభిధానచింతామణియందు క్రీ. శ. ౯౭౩ వ సం॥న కల్యాణిచాళుక్యరాజ్యమును స్థాపించిన యాహవమల్ల యుమ్మడి తైలప

నాంగ్ల పరాసు భాషలతదు పెక్కు కలవుకదా సంస్కృత వాఙ్మయ చరిత్ర విరచింపబడక పోవుటెట్లు? అను ప్రశ్నయొకటి రావచ్చును. వాస్తవమే పై భాషలలో సంస్కృత వాఙ్మయ చరిత్రలు గలవు; కాని యవి సంపూర్ణములుగావు. సంస్కృత వాఙ్మయోత్పత్తి వికసనములను గూర్చి పరిశోధన ఇంకను జరుగవలసిన దెంతయేనియు కలదు; కాని యది యఖిలభారత సమస్య. దాని నిచట చర్చించుట కవకాశము లేదు.

అన్యప్రాంత భారతీయులవలె నాంధ్రులకును సంస్కృతము పవిత్రమైన దేవభాష. కావున అనాదినుండి వారు వేదవేదాంతములను సకలశాస్త్ర పురాణేతిహాసాదులను పఠించి వైదికసంస్కృతభాషలలో చక్కని పాండిత్యమును గడించుటయేగాక నానావిషయములందును పెక్కు గ్రంథములను రచించిరి.

ఆంధ్రదేశమున బెంపొందిన సంస్కృతవాఙ్మయ చరిత్రను కాకతీయ యుగములో ప్రారంభింపవచ్చును. అంతకు ముందాంధ్రులకు సంస్కృత జ్ఞానము లేదా? వారు సంస్కృతమున గ్రంథరచన సేయలేదా? యని మీరడుగవచ్చును. కాకతీయులకు ముందు ఆంధ్రులకు సంస్కృతజ్ఞానము లేకను పోలేదు; వారు సంస్కృతమున గ్రంథరచన సేయక మానను లేదు. బౌద్ధసంస్కృత వాఙ్మయమును వర్ధిల్లజేసిన నాగార్జున బోధిసత్వాదులును జైనవిజ్ఞానము నాంధ్రదేశమందే కాక దక్షిణభారతము నందంతను వెదజల్లిన కుందకుందాచార్యాది యర్హంతులు నుండ కాకతీయులకు ముందు ఆంధ్రదేశమున సంస్కృతవాఙ్మయ మభివృద్ధి నందలేదని చెప్పుట కెట్లు వలను పడగలదు?

ఆంధ్రదేశ శాసనా వళియందు వేదవేదాంగ విదులును సర్వశాస్త్రపురాణేతిహాసనిష్ణాతులును నగు పండితోత్తము లనేకులు పేర్కొనబడియున్నారు; మఱియు పెక్కండ్రు కవుల పేర్లను వారిచే విరచితములైన గ్రంథనామములును గానబడుచున్నవి; కాని వారి

గ్రంథములు లన్నియు నామమాత్రావశిష్టములై పోయినవి. అప్పటి విద్వత్ప్రపంచమున నారెంత వాసికెక్కియుండినను, వారవ్వల సంపూర్ణముగ విస్మృతులై పోయిరి. శాసనములు బయల్పడి ప్రకటితములగు వఱకు వారి పేర్లుగూడ నందె యడగియుండినవి. వీరిమాట సట్లుండనిండు. ఆంధ్ర విద్వత్కుటుంబములనాదికాలమునుండియు కాశీ పుణ్యక్షేత్రమున నెలకొనియుండినవి. ఈకుటుంబములకు జెందినవిద్వాంసు లనేకులు తమపాండిత్యమువల్లను ప్రతిభవల్లను ప్రఖ్యాతులై యచ్చటి సంస్కృతవిద్యాపీఠమునకు మూలస్తంభప్రాయులై యుద్గ్రంథముల ననేకములను రచించిరి. ఈతరగతికి జెందినవాడే విశ్వవిఖ్యాతుడైన జగన్నాథ పండితరాయలు. ఇట్టిమహనీయులు మఱియెందఱో కలరు. వారినామములును వారురచించిన గ్రంథములను, లిఖితపుస్తకభాండాగారములందు నిక్షిప్తములై యున్నవి. కావున కాకతీయులకు పూర్వము ఆంధ్రులచేరచింపబడిన సంస్కృతగ్రంథముల నిచట పేర్కొనజాలక పోయినందుకు క్షంతవ్యుడను.

కాకతీయయుగమును గూర్చికూడ మనకు గలజ్ఞానము సమగ్రముకాదు. ప్రతాపరుద్రునికి పూర్వమెవ్వ రెవ్వ రేయేగ్రంథములను విరచించిరో మనకు స్పష్టముగ దెలియదు. కాకతిరుద్రదేవుని హనుమకొండ శాసనకావ్యరచయితయగు అచింతేంద్రునొక్కని నెఱుంగుదుము. ఇతడు చక్కగ కావ్యరచనాసామర్థ్యముగలవాడే; కాని యితడీ ప్రశస్తికావ్యమొక్కటిదక్క అన్యగ్రంథములను రచించెనేమొ తెలియదు. గణపతిదేవరుద్రదేవుల కాలమందు విద్వాంసు లనేకులు సంస్థానము నాశ్రయించియుండిరి. కాని వీరియం దెవ్వరేనియు గ్రంథకర్త లుండిరేమొ చెప్పుటకు సాధ్యముకాదు. ప్రతాపరుద్రదేవుడు కవిజనప్రియుడు. స్వయముగ పురుషార్థసార మను నీతి గ్రంథమును రచించెనని చెప్పుదురు. మఱియు కోలచలమల్లినాథసూరి యొక్క పితామహుండగు మల్లినాథపండితు నితడాదరించి సత్కరించెను. ప్రతాపరుద్రుని యాస్థానమ్ము నలంకరించిన సంస్కృతకవు

లలో నగ్రగణ్యుఁడు విద్యానాథుఁడు. ప్రతాపరుద్రయశోభూషణ మనుజగత్ప్రసిద్ధాలంకారశాస్త్రగ్రంథమును వ్రాసెను. అగస్త్యుఁడు బాలభారతనలోదయాది కావ్యములను రచించెను. అగస్త్యుడును విద్యానాథుఁడును నొక్కరేయని కొందరు పరిశోధకులు చెప్పెదరు. కావచ్చును. ప్రేమాభిరామకర్తయగు రావిపాటి త్రిపురాంతకుఁడును నిట్టివాఁడే. ఉదారరాఘవ కావ్యనిర్మాతయగు శాకల్యమల్లభట్టును ప్రతాపరుద్రుని యాశ్రయమును పొందినవాఁడే. వీరుగాక జైన కవులుకొందఱుకూడ అతనియాస్థానమున వెలసిరి. ఇందఱుకవులకిరవగుట చేతనే యోరుగల్లాకాలమున భారతీయవిజ్ఞానమునకు దక్షిణమున ముఖ్యకేంద్రస్థానమాయెను.

మహమ్మదీయుల ఆగమనముతో పూర్వస్థితిగతులు మారిపోయినవి. భరతఖండమునకు వారి రాక ప్రళయతుల్యమైనది. జాతీయ స్వాతంత్ర్యముతోపాటు సంస్కృతియును రూపుమాసిపోవునట్లయినది కాని దానిని సమసిపోనీక సంరక్షించిన వారాంధ్రులు. అందు ముఖ్యముగ [illegible] విజయనగరసార్వభౌములు. ఇదియె ఆంధ్రులు హిందూజాతికి జేసిన అమూల్యమైనసేవ. ఈ సందర్భమున ఆంధ్ర జాతీయ సమితియొక్క ముఖ్యాదర్శములను స్మరణకు దెచ్చుకొనుదు. జాతీయసమితి యేర్పడినది హిందూ ధర్మమును సంరక్షించుటకొఱకు. హిందూ ధర్మమునకును సంస్కృతికిని యవినాభావ సంబంధము గలదు. ధర్మమును సంస్కృతిని కాపాడుటకు స్వాతంత్ర్యమత్యంతావశ్యకము. కావున ఆంధ్రజాతీయసమితి దేశీయస్వాతంత్ర్యమును పునః ప్రతిష్ఠ గావించినతోడనే హిందూధర్మ సంస్కృతి పునరుద్ధరింపగడగెను. ఆంధ్రదేశమంతటను నూతన ప్రబోధము గల్గినది. నశించిపోనున్న విజ్ఞానమును పునరుజ్జీవింపజేయుటకు ప్రబలప్రయత్నములెల్లయెడలను సాగినవి. వేదవిద్యలను సకలశాస్త్రములను వాఙ్మయమును, కళలను పరిశోధించి వాని యర్థమునకు ప్రకటించుటకు దగు నేర్పాటులు సేయబడెను. ఈమహాద్యమహోద్యమము కంతటికిని

కారణ భూతుఁడు విద్యారణ్యస్వామి. ఆయన కారణ జన్ముఁడు; కలియుగదోషావసన్నధర్మోద్ధరణకై మనుష్యరూపుఁడై యవతరించిన పరమ శివుఁడు, సకల కలాగమవేది. తత్వజ్ఞాననిధి. విశాల హృదయుఁడు, విధివశమున మ్లేచ్ఛధర్మము నవలంబించిన హిందువుల పునరాగమమునకు మార్గము జూపెను; విరూపాక్షస్వామి యాజమాన్యము క్రింద ధర్మసామ్రాజ్యము స్థాపించెను. విజయనగర చక్రవర్తులను వైదికమార్గ ప్రవర్తకులను గావించి సకల వర్ణాశ్రమ ధర్మసంరక్షణకు బూనికొల్పెను. నానాదేశములనుండి పండితులను రప్పించి వారికి గ్రాసవాసాదులకు సదుపాయములను గల్పించి వారిచే వేదవేదాంగములకును సర్వశాస్త్రములకును వ్యాఖ్యానములు వ్రాయించి వేదవేదాంగశాస్త్రముల యర్థములు జనులకు సుబోధమగునట్లు చేసెను. విద్యారణ్యుఁ డాత్మవిద్యావిశారదుఁడు– సాహితీసాగరుఁడు. స్వామివారి యాదేశమువారొప్పున శిష్యులనేక శాస్త్రగ్రంథములను కావ్యనాటకములను రచించి ప్రకటించిరి. ఆంధ్రదేశమందెల్ల యెడలను విజ్ఞానాభిమానములు మెండైనవి. నూతన విద్యాపీఠములు నెలకొనినవి. వీనియందు ముఖ్యమైనవి నాలుగు. విజయనగరమున రాయలయాస్థాన మొకపీఠమునకు ముఖ్యస్థానము. రెండవదానికి రాచకొండయందు వెలమదొరల యాస్థానమును, మూడవదానికి కొండవీటియందును నాలుగవదానికి రాజమహేంద్రవరమున రెడ్డిరాజుల సంస్థానములును ప్రధానస్థలము లాయెను. ఈ విద్యాపీఠముల కొండొంటికి పోటీలుగలిగి తత్తదాశ్రిత పండితులును కవులును అన్యవిద్యాస్థానములకు విద్యావాదప్రదర్శనముల కొఱకు బోవువారు. దీనికి ఫలితముగ సంస్కృత వాఙ్మయ మొకయాంధ్రదేశమునందేకాక దక్షిణదేశ మందంతటను తామర తంపరగ నభివృద్ధి నందినది. చక్రవర్తులు, రాజులు, సామంతులు, మన్నెదొరలు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది చతుర్వర్ణములవారును, పండితులు, కవిగాయకనర్తకాది కళోపాసకుల కాశ్రయమొసఁగుచు స్వయముగను గ్రంథకర్తలై విద్యాభివృద్ధికి గారణభూతులైరి. స్త్రీలు పురుషులకు [illegible]. ఇట్లు పెరిగిన వాఙ్మయచరిత్రను సంగ్రహముగ [illegible]

నైన చెప్పనవకాశములేదు; చెప్పవలసిన విషయము లింకను పెక్కు-గలవు: కావున నీయంశము నింతటితో జాలించి యాంధ్రవాఙ్మయ ప్రశంసను గడంగెదను.

తెలుగువాఙ్మయము:— తెలుగుకవిత పుట్టుకనుగూర్చి చాల కాలము మనదేశమునందొక దుర్భ్రమ ప్రబలియుండెను. క్రీ. శ. ౧౦౧౯ మొదలు ౧౦౬౧ వఱకును వేంగీరాజ్యమును పాలించిన పూర్వ చాళుక్య రాజరాజనరేంద్రుని కులబ్రాహ్మణుడును ఆస్థానకవియు నగు నన్నయభట్టారకుఁడు ఆంధ్రమున కవిత్వమును పుట్టించెననియు దత్కారణమున నతఁడు ప్రథమాంధ్రకవియనియు నందఱును విశ్వ సించువారు. ఇది కేవలము మిథ్యయని ఇప్పుడందఱును ఎఱుఁగుదురు. వాస్తవమును విచారించిన నన్నయభట్టారకుఁడు తెలుఁగున కవిత్వ మును పుట్టింపలేదు; అతఁడు ప్రథమాంధ్రకవియుగాడు.

తెలుగుభాషయందు నన్నయభట్టునకు మూఁడునూటయేబది యేండ్లకుముందు కవిత్వముపుట్టినది. ప్రథమముననాంధ్రమున కవిత్వమల్ల ప్రారంభించినకవి యెవ్వడో మనకు తెలియదు. ఈవిషయమున సత్యనిర్ధా రణ కుపయుక్తోపకరణములు శాసనములు దప్ప మఱియొవ్వియు లేవు. తెలుగుభాషయందే వ్రాయించిన శాసనములు క్రీ. శ. ౭వ శతాబ్ద ప్రారంభమునుండియు పెక్కుగానవచ్చుచున్నవి. ఇవి గద్యాత్మకములు. క్రీ. శ. ౯వ శతాబ్దోత్తరార్థమువఱకును వీనియందెచ్చటను తెనుఁగున కవిత్వపుజాడలే కానరావు. ఇదిసహజమే. ఆకాలమునందొక్క కవితయేకాక తక్కిన కవులును శాస్త్రములును రాజుల ప్రోత్సాహ మూలముననే యభివృద్ధినందెడివి. అప్పుడు ఆంధ్రదేశమంతయు వన్యా క్రాంతమై యుండెనని నిన్నటియుపన్యాసమున జెప్పియున్నాఁడను. దక్షిణాంధ్రమంతయు పల్లవుల యేలుబడిక్రింద నుండినది. చాళుక్యుల కాలమునే వారు క్రమముగ నాంధ్రదేశమున దమప్రాముఖ్యమును గోలుపోవుటచే వారిదృష్టి సంపూర్ణముగ ద్రావిడదేశమునందె. అట్లనై

యుండెను. తక్కినయాంధ్ర దేశమంతయు జాళుక్య సామ్రాజ్యమం దిమిడియుండెను. పశ్చిమాంధ్రమును తెలంగాణమును బాదామి చాళుక్యులనశమునను తీరాంధ్రము పూర్వచాళుక్యులయధీనమందును ఉండినవి. చాళుక్యులు కర్ణాటకులు. కావున వారునువారియనుచరులను కన్నడభాషనాడుచుండిరి. రాజభాషయగుటచే నదిప్రసిద్ధికెక్కినది. దేశపాలన వ్యవహారములు కొంతమట్టుకు తెనుగునందే నడచుచువచ్చినను మాతృభాషయగు కన్నడముపై నాదరమువారికి తగ్గలేదు. కన్నడపదములు, పలుకుబడులు పెక్కు తెనుగున ప్రవేశించినవి. ఇందుమూలమున భాషయందలిశబ్దజాలము విస్తరించినను దానిపరిశుద్ధత చెడినది. తురకరాజులకాలమున నరబీ పారసీ భాషల సంపర్కము వలనను, నాంగ్లేయులపాలనయందు ఆంగ్లభాషాసంపర్కమువల్లను నెట్టి మార్పుగలిగెనో చాళుక్యయుగమున కన్నడభాషపొత్తువలన నంతకు మించిన మార్పు తెనుగున గనుపట్టినది.

కాలక్రమమున రాజకీయకారణముల వలన కన్నడభాష కాంధ్రదేశమున గౌరవము తగ్గనారంభించినది. దీనికి కారణమును నిప్పటి యుపన్యాసమున సూచించియున్నాడను. క్రీ. శ. ౮వ శతాబ్దమున బాదామిచాళుక్యరాజ్య మంతరించినది. రాష్ట్రకూటులు బాదామి సింహాసనము నాక్రమించుకొని పూర్వము చాళుక్యుల యేలుబడికింది దేశమును పాలింప నారంభించిరి. అంతటితో దృప్తినందక పూర్వచాళుక్యులపై దమయధికారమును స్థాపింప దలపెట్టిరి. తదారభ్య పూర్వచాళుక్యులకును, రాష్ట్రకూటులకును వైరము దినదిన ప్రవర్ధమానమై పెరిగి కర్ణాటాంధ్ర దేశములకు యుద్ధములు నిరంతర మతితీవ్రముగ నడువసాగెను. ఈ వైరాతిశయమువలన పూర్వచాళుక్యులు తాము కర్ణాటులగుటను విస్మరించి తమ యేలుబడికింది యాంధ్రప్రజలలో నేకీభవించి వారివలె దామును ఆంధ్రులమని యెంచసాగిరి. ఈ యభిప్రాయము వీరికి గలిగి నప్పటినుండియు వీరికాంధ్రభాష యందభిమానము హెచ్చుటచేత దానిబలుదెఱగుల నభివృద్ధి

సేయఁగడఁగిరి. కన్నడమువలె నాంధ్రమునను కావ్యనిర్మాణము సేయుట యుక్తమని నిశ్చయించి కవుల నాదరించి వారిని కవనమునల్లుటకు బురికొల్పిరి. ఈ యంశమునే నన్నెచోడదేవుఁడు తన కుమార సంభవ పీఠికయం దిట్లు చెప్పియున్నాఁడు.

'మునుమార్గ కవితలోకం
బున వెలయఁగ దేశికవితఁబుట్టించి తెనుం
గుని లిపిరంధ్ర విషయం
బున జనచాళుక్యరాజు మొదలగుపలువుర్.'

ఇందువలన దేశికవిత బుట్టించి యంధ్రవిషయంబున దెనుఁగును చాళుక్యులు నిల్పిరనియు వారికి ముందు తెనుఁగున కవిత్వము లేదనియు దెల్లమగుచున్నది దేశికవిత్వమును బుట్టించి తెనుఁగు నంధ్రవిషయమున నిలిపిన చాళుక్యరాజెవ్వఁడో, అతఁడావంశమున నేశాఖకు జెందిన వాఁడో తెలియదు. కాని తెనుఁగు దేశములో పూర్వచాళుక్యరాజులకే గాఢతమ సంబంధముండిన కారణమునను తెనుఁగు పద్యరచన మొట్టమొదట పూర్వచాళుక్య వంశజుఁడగు గుణగ విజయాదిత్యుని (క్రీ. శ. (౮౪౪—౮౮౭) శాసనములందే పొడకట్టుచుండుటవల్లను నన్నెచోడకవి చెప్పిన విధమున దేశియందు కవిత్వమును పుట్టించి తెనుఁగు నంధ్రవిషయమున నిలిపిన చాళుక్యరాజు గుణగవిజయాదిత్యుఁడు కాని లేక యతని పూర్వికులగు పూర్వచాళుక్యుల యందొకఁడు గానియైయుండునని తలఁచుట యుక్తము.

ఇట్లు ప్రారంభమైన తెనుఁగుకవిత్వమునకు కన్నడకావ్యములు మేలుబంతులైనవి. తెనుఁగు కవులకు గన్నడకవులు మార్గదర్శకులైరి. ఆంధ్రకావ్యములలో నాదికావ్యమనఁదగు నన్నెచోడుని కుమారసంభవమును బ్రాచీనకర్ణాటకావ్యములతో పోల్చిచూచిన నీవిషయము దెల్లము కాఁగలదు. నన్నయభట్టు భారతమునకుగూడ కర్ణాటకావ్యముల సోకు తప్పలేదు. ఇంకొకవి శేషము. ఆంధ్రవాగనుశాసనుఁడు పూర్వ

చాళుక్యరాజుల కులక్రమాగత పురోహితుడగుటచే నతని పెద్దలు కుబ్జవిష్ణువుతో గూడ వేంగికివచ్చి యచట స్థిరనివాసమేర్పరచుకొని వేంగినిమాతృదేశముగబరిగ్రహించిన కర్నాటబ్రాహ్మణులై యుండ వలయును. నన్నయభట్టునకు సహాధ్యాయుడును భారతరచనయందు పాకశాసనునకు నారాయణునివలె దోడుపడిన నారాయణభట్టు కర్నాటక చక్రవర్తియగు నాహవమల్ల సోమేశ్వరదేవుని ప్రధానియును, వాణస వంశజుడును నగుకర్నాటక బ్రాహ్మణుడు. నన్నయభట్టనారాయణ భట్టులు నాగవాణి (ఇప్పటినాగాయి) విశ్వవిద్యాలయమున సహాధ్యాయులై విద్య నభ్యసించి యుండిరి. కావున నన్నయ కృతాంధ్ర భారతమున కర్నాటకావ్యపు బోకడలు గానవచ్చుట వింతకాదు.

ఆంధ్రకవిత్వోత్పత్తిని గూర్చి యింతదూరము నొక్కి చెప్పుట వృథాకాలక్షేపము కొఱకుగాదు. మనవారలనేకులు ఆంధ్రకవిత్వ మన్యసంపర్కములేక తనంతటనె ప్రభవించెనని వాదింతురు. నిష్పక్షపాతముగ చారిత్రకదృష్టితో పరిశీలించిచూచిన మనకవిత కర్నాట కవితపై నాధారపడియున్నదని తెలుచున్నది. కర్నాటాంధ్ర సంస్కృతుల సంయోగమువలననే పద్యరచనయు కావ్యనిర్మాణమును ప్రారంభమైనది.

ఆంధ్రవాఙ్మయచరిత్రను వర్ణించుట నా యుద్దేశముగాదు; కాని దానిసామాన్యలక్షణములను గొన్నటినైనను ఇచట చేర్కొనకతప్పదు. ఆంధ్రవాఙ్మయ మనుకరణవాఙ్మయము. నన్నయ తొలిగ్రంథమున సంస్కృతమహాభారతము నాంధ్రీకరింపదొడగెనో కాని దానిబలమున నాంధ్రవాఙ్మయమంతయు ననువాదములమయమై పోయినది. సంస్కృతవాఙ్మయము నాంధ్రులవలె భారతీయులలో మరియెవ్వరును చూరగొని యుండలేదు. సంస్కృతపురాణేతిహాసమహాకావ్యనాటక ధర్మశాస్త్రాది సకలవిధ గ్రంథములకును తెనుగున దూర్చి కేటులను తయారుచేయుటయే తమజీవితపరమావధియని యాంధ్రకవులు తలంచి నట్లున్నది. స్వతంత్ర మిశ్రకావ్యములు రచించుటయని ప్రగల్భములు

వల్కిన ప్రబంధకవులు గూడ సంస్కృతకవులగ్రంథములనుండి లూటీ సేయుట మానలేకపోయిరి. కేవలకల్పనాకథలను కృత్రిమరత్నములని నిరసించిరి; ఆద్యసత్కథలు వానిని బుట్టురత్నములని వానిప్రకాశమును డిందుపఱచిరి. మిశ్రకథలవారిత సత్కవికల్పనావిభూషావహాపూర్వవృత్తము' లగుటవని 'సానలదీరిన జాతిరత్నముల'ని ప్రశంసించిరి. కథలేమో పాతవని నారేయొప్పుకొనియున్నారు గదా! ఇఁక 'సత్కవికల్పనావిభూషావహ' తవలన సానలదీరినజాతిరత్నములనిరికదా. ఆ సత్కవికల్పనావిభూష లెవ్వియో విచారింతము. చాలవఱకీభూషలు ఎరవుదెచ్చుకున్నవే. ప్రబంధకవులు తాముపఠించిన సంస్కృతకావ్యాలలో దమకునచ్చిన శ్లోకములను తర్జుమాచేసి పేరుచెప్పక తమప్రబంధములలో నెక్కించుకొనిరి. ఒకయుదాహరణము అల్లసాని పెద్దనవంటియద్భుతప్రతిభాశాలియైన మహాకవిగూడ,

'ఆయాతియాతి పునరేవజలంప్రయాతి
పద్మాంకురాణి విచినోతి ధునోతిపక్షౌ
ఉన్మత్తవద్భ్రమతి కూజతి మందమందం
కాంతావియోగవిధురో నిశిచక్రవాకః'

అను శ్లోకమును 'ఏ విహంగముగన్న నెలుగిచ్చుచును సోరెకును సైకతంబుల గూడదారుఁ' అను నద్భుతమైన సీసపద్యముగ మార్చి మనుచరిత్రలోని కెక్కించుకొనెను. ఇఁక నితరులమాట చెప్పవలయునా? ఇట్లగుటవలన ప్రబంధకవులను వారి కావ్యములను దూరుచున్నాఁడనని భ్రమపడరాదు. వాస్తవముగవారు సంస్కృతవాఙ్మయదాస్యమునుండి విముక్తులై స్వతంత్రకావ్యములను రచింపఁగడగిరి. పెద్దన, కృష్ణరాయలు, తిమ్మన, తెనాలిరామకృష్ణుఁడు, రామరాజభూషణుఁడు మున్నగువారు కృతార్థులైరి. కాని సాంప్రదాయమును సంపూర్ణముగ విసర్జింపజాలక పూర్వులపద్ధతిని మరియొకగీత నవలంబించిరి. ఈ సంస్కృతవాఙ్మయదాస్యము ఇరువదవ శతాబ్దప్రారంభము వఱకు తొలగలేదు. ఆంగ్లేయ విద్యాభ్యాసమువలన మనవిజ్ఞానము విస్త

రించినది. పాశ్చాత్యవాఙ్మయములన్నియు మనకు కరతలామలకము లైనవి. తన్మూలమున నాంధ్రవాఙ్మయములోని లోపములు కొన్ని మనవారి దృష్టికి గోచరించినవి. ఇట్టిలోపములలో నాంధ్రమున దృశ్యకావ్యముల యభావము ముఖ్యమైనది. ఈ లోపమును తొలగించుటకొఱకు మనవారనేకులు నాటక రచనకు ప్రారంభించిరి. వీరు రెండు తెగలుగ విడివడిరి. కొందఱు వీరిసంఖ్య యల్పము. సంస్కృతసంప్రదాయము ననుసరించిరి. పెక్కండ్రాంగ్లనాటక రచనా మర్యాదల నవలంబించిరి. ఉభయపక్షములవారును జగత్ప్రసిద్ధమైన సంస్కృత నాటకములను పదేపదే యాంధ్రీకరణము గావించిరి. ఆంగ్లేయ నాటకముల కీ మర్యాదకలుగలేదు. దీనికి ముఖ్యకారణ మాంగ్లేయనామములును మన కపరిచితములై మనకు వింతగొల్పుచు మనభాషాపక్కికనుకూల పడకపోవుటయే. కావున కీ. శే. రంటాల వెంకటసుబ్బారావువంటి వారొకరిద్దఱుతప్ప ఆంగ్లేయనాటకములను యథామాత్రకముగా దెనిగింపఁ బూనుకొనలేదు. కాని యనేకు లాంగ్లేయనాటకపాత్రలకు నూతన నామకరణము గావించి తెనుగువారి దుస్తులను దొడిగి యాంధ్రీకరణమును సాగించిరి. ఇదిమన నాటకరచనయందు ప్రథమ దశయని చెప్పవచ్చును. రెండవదశ స్వతంత్ర నాటకరచనతో ప్రారంభమైనది. పూర్వమునుబోలి మన నాటకరచయితలు సంస్కృతాంగ్ల సంప్రదాయముల ననుసరించిరి. కొన్ని చక్కని స్వతంత్రాంధ్ర నాటకములు వెలువడినవి. వానినన్నిటి నిచట పేర్కొనవలసినపనిలేదు. కాని సంస్కృతి సాంప్రదాయము ననుసరించి రచింపబడిన కీ. శే. బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారి ప్రతాపరుద్రీయమును, కీ. శే. రాజశ్రీ గురుజాడ అప్పారావు పంతులవారి కన్యాశుల్కమును చెప్పక తప్పదు. వీనిమించిన నాటకము లాంధ్రభాషయందు లేవని నా యభిప్రాయము. మనభాష యున్నంతకాలమును నీ రెండును స్థిరముగ నిలువగలవని నా నమ్మకము.

ఆంధ్రులనువారు విద్యయందున ప్రౌఢలు వారలిగల నేర్పున్నుల

యందుగానరాదు. వారి అనువాదపద్ధతి యెట్లుండదగునో కొఱవిగోప
రాజు వివరించి యున్నాఁడు.

'తవవచో విశేషమైనయర్థ పూర్వక ధారిలోక్తిఁ జెప్పుటేమికడిఁది!
యొకఁడు గోలవట్టియొయ్యనఁగొనిపోవ నంధుఁడెచటికైన నరుగుటరుదె!

'ఈ సరసోక్తి కావ్యమొకఁడిమ్ముల సంస్కృతభాష నచ్చుగాఁ
జేసినవాఁడు మఱిచేయుట యేటిది ? యంచుఁజెప్పఁగాఁ
జేసి యనాదరంబునకఁ జేయకుఁడీ విబుధాదుతూటుగా
నేసిన నందెపాఱమాఱి యేసినవానిదసూటికావునన్'

'తెలుఁగునకెల్లఁదల్లియగుఁ దెల్లముసంస్కృతభాషయందులో
బలుకులెఱుంగుచోఁ బదవిభాగము నన్వయమర్థమాచునీ
మలఁకలకంటెనందుల సమర్మము దేటతెనుంగయొప్పనా
కొలదిప్రియంబుగాదె చెఱకుల్ దినుకంటె రసంబుగ్రోలినన్'

సంస్కృత మాతృకలుప్తమై పోవుటవలన గోపరాజు తాను వివరించిన రీతి నాంధ్రీకరించెనేమో నిశ్చయించి చెప్పుటకువీలుకాదు, ఇది యంత ఆకును సులభసాధ్యముగాదు. సంస్కృత మాతృకలను మరపించు కవిత్రయమువారి యాంధ్రమహాభారతమును పోతనగారి శ్రీమదాంధ్ర భాగవతమును బట్టిచూడఁగా మొత్తముమీద నాంధ్రీకావ్యమును సంతృప్తికరముగ సాగించిరని చెప్పవలసియున్నది.

ఆంధ్రీకరణ వ్యామోహముల వలన మన భాషయందు స్వతంత్ర కావ్యరచన బహుళముగ సాగకపోయినది. కాని దీనిమూలమున మన కనర్ఘమైన లాభమొకటి చేకూరినది. సంస్కృతభాషాజ్ఞానము లేకపోయినను నావాఙ్మయవిజ్ఞాన మాంధ్రుల కలవడిన ట్లన్యభాషీయుల కెవ్వరికిని అలవడలేదు. సంస్కృతభాషయందు నిగూఢమైయుండు సమస్త విషయములును మనవారికి గరతలామలకమైనట్లు అన్యులకు

గా లేదు. కావున మన యార్యధర్మములును సంస్కృతియు నితరుల కంటె నెక్కువగ సంక్రమించినవి. ఈలాభము స్వల్పమైనదికాదు.

ఇంతదనుక మనసంస్కృతి వికాసమున నాంధ్రభాషావాఙ్మయము లెంతవఱకు సహకారులాయెనో విన్నవించితిని. భాషావాఙ్మయములను గూర్చి చెప్పతగినవిషయ మెంతేనియుఁ గలదు, దాని కిది సమయముగాదు; కాని భాషావాఙ్మయములకు సంబంధించిన విషయమొకటి కలదు. అది వ్రాత- ఇది మన నిర్మాణము గాదు; పూర్వికుల ప్రసాదము వలన మనకు లభించినదే. ఇట్లు లభించిన భాగ్యమును తాము మాత్రమె యనుభవించి తృప్తినందక పొరుగువారికిగూడ దాని ననుగ్రహించిరి. భారతీయసంస్కృతి ప్రసారణమున కిట్లు మనవారు సహకారులైరి.

భరతఖండమున వ్రాత యనాదినుండి వాడుకలో నున్నది. మొహెంజోదారో యందు వెలువడిన ముద్రలవలన భారతీయు లైదువేల యేండ్లకుముందే వ్రాయను జదువను నేర్చియుండిరని విశదమగుచున్నది. ఎవ్వరును ఇంకను ఈవ్రాతను జదువుమార్గమును గనుగొనలేదు; కాని లిపిశాస్త్రనిష్ణాతులు దీనిగూర్చి రెండుమూడు ముఖ్యాంశములను గనిపెట్టిరి. ౧. ఈవ్రాత వ్రాయబడిన దక్షరలిపియందు గాదు 'బొమ్మల లిపియందు' అని. రెండవది యర్వాచీనకాలమున మౌర్యయుగమందుమ దరువాత కొన్ని శతాబ్దములవఱకును వ్యవహారమందుండిన బ్రాహ్మీ లిపికిని దానికిని కొన్ని పోలికలు గలవు. మూడవది, బ్రాహ్మీ వలెనే మొహంజోదారో వ్రాతయు సాధారణముగ యెడమవైపునుండి కుడిప్రక్కకు వ్రాయబడియున్నను కాదాచిత్కముగ కుడినుండి యెడమవైపునకు వ్రాయునాచారము కూడ గలదు. కాని దీనికి ఇప్పుడు మనదేశము నందన్ని ప్రాంతములందును వాడుకయందుండు లిపులకును గట్టిసంబంధమును లేదు.

ఆంధ్రులు దక్షిణాపథమునకు వలసలు వచ్చినప్పుడు అచ్చట నివసించుచుండిన జనులు చదువను వ్రాయను నేర్చియుండిరేమో తెలి

యదు. ఒకవేళ వారు వ్రాయ జదువ నేర్చియుండినను వారు వాడిన లిపి యెద్దియో కనుగొనుట కాధారములు లేవు. మౌర్యులలో గూడ బ్రాహ్మిలిపి దక్షిణాపథమునకు వచ్చినది. ఇది సర్వసామాన్యముగ ప్రజలలో వాడుకయందుండినదని దక్షిణభారతమున పెక్కుస్థలముల యందు కానవచ్చు బ్రాహ్మిశాసనములవల్ల విదితమగుచున్నది. కాని ఈలిపి చిరకాల మట్లె యుండలేదు. క్రమక్రమముగ క్రీస్తుశకారంభ శతాబ్దములలో నొకనూతన రూపమునంది యాంధ్రకర్ణాటక దేశములలో వాడుకయందుండినది. దీనికి తెనుగు కన్నడ లిపియని లిపిశాస్త్రజ్ఞులు నామకరణము జేసియున్నారు. దక్షిణ పశ్చిమాంధ్రము లీకాలమున పల్లవరాజుల యధికారముక్రింద నుండినవి. వారి రాజధాని కాంచీపురమునందున్నను తామాంధ్రులగుటచేతను ద్రావిడదేశమున నప్పుడు నేఱు లిపి లేకపోవుటచేతనో ఉండినను వారి యక్కరల కనుకూలపడక పోవుటచేతనో వారు తెలుగు కన్నడ లిపినే తమశాసనములను రాజకీయవ్యవహారపత్రములను వ్రాయుటకు వాడుచువచ్చిరి. క్రీ. శ. ౭వ శతాబ్దారంభమున చాళుక్యుల దండయాత్రలవలన పల్లవులు దక్షిణ పశ్చిమాంధ్రములందు జాలభాగము గోల్పోయిరి. యీ దకారణమున వారి దృష్టియంతయు ద్రావిడదేశమందె లగ్నమాయెననియు నింతకు ముందొకచోట చెప్పియున్నాను. దీని ఫలితము లిపియందు గానవచ్చినది. తెనుగు కన్నడలిపి మారనారంభించినది; మొదట పల్లవగ్రంథరూపముగ పరిణామమందినది; తరువాత ప్రాచీన తమిలి లిపియై మారి తుద కిప్పటి తమిలి లిపియై రూపందినది. ఈవిషయమును లోకము మరచినది. ఆంధ్రులు పెంపందించిన భారతీయ సంస్కృతి చరిత్రను పరిశీలించు నపుడీయంశమును స్మరణకు దెచ్చుకొన వలసియున్నది.

వాస్తునిర్మాణములు:—వాస్తునిర్మాణ విద్యయందు ప్రాచీనాంధ్రులు నిపుణులు. కాలగతివల్లను, ప్రజామతాభిమానముల మార్పువల్లను, మతోన్మాదుల చెయ్దముల వల్లను ప్రాచీనకట్టడములెల్లను ధ్వంసమైపోయినను యర్వాచీనకాలపు కట్టడములుకొన్ని

యింకను అచటనచట నిలిచియున్నవి. ధ్వంసమైపోయిన వాస్తువిశేష ములశైథిల్యములును నిలిచియుండు సర్వాచీనకట్టడములును మన పూర్వీకుల వాస్తునిర్మాణచాతుర్యమును దెలిసికొనుటకు గలయాధార ములు. ఆంధ్రదేశమున గానవచ్చు ప్రాచీన వాస్తునిర్మాణములు దేవతాయతనములు, నివాసములు అను రెండు తరగతులుగ విభక్త మగుచున్నవి.

దేవతాయతనములు మూడు తెరగులవి. ౧ బౌద్ధస్తూపచైత్య విహారాదులు. ౨ జైనవతులు. 3 హిందూదేవాలయములు.

బౌద్ధగాథలప్రకారము, బుద్ధుని జీవితకాలమునందే బౌద్ధధర్మ మును స్వీకరించిన జనపదములలో నాంధ్రదేశ మొకటి. దీనిని సత్య మని నమ్ముటకు వీలులేదు. కాని మౌర్యయుగమునను సాతవాహన ఉత్తరసాతవాహన యుగములందును, ఆంధ్రదేశమున బౌద్ధమతము ప్రబలియుండెనని మనము నిశ్చయముగ జెప్పవచ్చును. కాని దేశమం దెల్లయెడలను నొక్కతెరగున నది జనాదరణకు పాత్రమైయుండెనని యనుకొనరాదు. ఇతవఱకు బయల్పడిన బౌద్ధవాస్త్వవశిష్టములనుబట్టి చూడగా నిప్పటి సర్కారులకు సరిపోవు తీరదేశమునను తెలంగాణము నను బౌద్ధధర్మము సర్వత్ర గౌరవాదరములకు పాత్రమైయుండినది. కాని దక్షిణ పశ్చిమాంధ్రములలో దానికంత ప్రాపకము లేదని చెప్ప వలసి యున్నది. బౌద్ధయుగమున తీరాంధ్రమునను తెలంగాణము నను పెక్కుస్తూపములుండినవి. ప్రతిగొప్ప గ్రామమునందును స్తూపము లుండెనన్న నదియతిశయోక్తి కాజాలదు. కాని వానియందు ముఖ్య మైనవానిని బౌద్ధప్రపంచము నంతటను ప్రఖ్యాతినందిన వానిని రెంటిని మాత్రము పేర్కొనెదను. అందొకటి యమరావతి, రెండవది నాగా ర్జునకొండ. తెలింగాణమున కొండాపురముదగ్గరను మఱికొన్ని తావుల లోను ఇటీవల ప్రాచీనబౌద్ధయుగపు శైథిల్యములు గనుగొనఁబడినవని వార్తాపత్రికలయందు ప్రకటింపబడినవి. ఇందు కొండాపురము ముఖ్య మైనది. అచట హైదరాబాదు సర్కారు ప్రాచీన వాస్తుపరిశోధక

శాఖవారుకొంత ఘనకార్యమును సాగించినట్లున్నది. చరిత్రపరిశోధ
కుల వార్షికసమావేశములందు జరుగు నుపన్యాసముల మూలమున
అచ్చట లభించిన యవశిష్టముల స్వభావము కొంత తెలియవచ్చినది.
విపులముగ వివరించు గ్రంథమేదియు నింకను వెలువడలేదు. స్తూప
నిర్మాణమును గూర్చి జెప్పదగిన విశేషము లెవ్వియు లేవు. స్తూప
మనగా మట్టిదిబ్బ'. అన్ని మట్టిదిబ్బలకును ఈ పేరుచెల్లదు. 'నిర్వా
ణమునందిన బుద్ధుని యస్థికలనుగాని, భస్మమునుగాని భద్రపరచి
యుంచుటకగు నొకసమాధివంటి నిర్మాణము. స్వరూపమున నొక
వేదికమీద బోరగించిన చాకిబాన వలెనుండును. ఆద్యమున బుద్ధభగ
వంతుని యస్థ్యాది శారీరకావశిష్టములకే స్తూపమున నిక్షిప్తపఱచు
మర్యాదజరిగెడిది; కాని క్రమక్రమముగ బౌద్ధధర్మప్రవర్తకులైన
మహనీయుల యవశిష్టములమీదగూడ స్తూపములను నిర్మించుట వాడుక
యైనది. స్తూపనిర్మాణమునకంటె దత్పరివృతప్రాకారమె ముఖ్య
మైనది. స్తూపములను మట్టితోను ఇటుకలతోనుకట్టువారు, చుట్టు
ప్రాకారము చలువరాళ్ళతో నిర్మించెడివారు. ఈ ప్రాకారముపై
చుట్టు బుద్ధునిజీవితచరిత్రను, బోధిసత్త్వులయుదంతముల ప్రతిమారూప
మున చెక్కువారు. ఆధునిక ప్రపంచమున స్తూపముల కీచెక్కడపు
శిలాప్రతిమల వల్లనే ప్రఖ్యాతికల్గినది. శిల్పదృష్టిని జూచిన యెడల అమ
రావతి నాగార్జునునికొండలందుగానవచ్చిన ప్రతిమలసౌందర్యము ప్రపం
చమున మఱియెచ్చటను గానరాదు. వానియందు గానవచ్చు వాస్త
వికతయు, చైతన్యమును భావస్ఫురణమును చూపరులను మైమఱపించి
యొకమాయాలోకమునకు గొనిపోవుచున్నవి. ఈ ప్రతిమలవలన మన
పూర్వికుల సౌందర్యపిపాసయు, కల్పనాచాతుర్యమును, శిల్పనైపుణ్య
మును మాత్రమేకాక యప్పటి మతసాంఘికార్థికపరిస్థితులును
వ్యక్తములగుచు చరిత్రకారుల కత్యంతోపయుక్తములగుచున్నవి.

స్తూపముల తరువాత చెప్పదగినవి చైత్యమందిరములు. ఇవి
రెండు తెరగులుగ నున్నవి. కొన్నికట్టడములు, రాతిలోగాని ఇటు

కలతోగాని వీనినిర్మించువారు. సాధారణముగ నిది యొక చతురస్రమ శాల. ఒకచివర కొంచెవర్తులమై యందు స్తూపచిహ్నమొకటి నెల కొల్పబడియుండెడిది దీనిచుట్టును బౌద్ధజనులు ప్రదక్షిణము సేయు వారు. పైకప్పు రూపమున బోరగిలిన బండిజల్లను బోలియుండెడి ఈతరగతి చైత్యశాల లరుదు. గుంటూరుజిల్లా చేజర్ల గ్రామమున నొక్కటి కలదు. ఇది యిప్పుడు శివాలయమై కపోతేశ్వరాలయ మన బడుచున్నది. రెండవతరగతి చైత్యగృహములు కొండలను తొలిచి నిర్మించినవి. బౌద్ధయుగమునను తదనంతరమును భారతీయ శిల్పు లకు కొండలును బండలును తను స్వభావకాఠిన్యమును వీడి మైనము వలె మెత్తబడి యేరూపము వహింపమనికోరిన నారూపమున దాల్చి నవి. పశ్చిమభారతదేశమున నిట్లు కొండలను తొలిచి నిర్మించినవి పెక్కు కలవు. వీని నిర్మాణ సౌందర్యము లోకుల హృదయమును చూఱగొన్నది. చైత్యగృహము లెల్లప్పుడును బౌద్ధసన్యాసులును సన్యాసినులును వసించు సంఘారామముల కడ నుండెడివి. చైత్యగృహ ములవలె సంఘారామములును వానినిర్మాణ సామగ్రి వలన రెండుతర గతులుగ విభక్తములై యుండినవి. ఒకతరగతి సంఘారామముల లిష్టికలచే గట్టబడినవి. కొండలులేని స్థలములందు ఇష్టికలనే వాడవలసి వచ్చెను. తీరాంధ్రమండలి సంఘారామము లనేక మీతరగతికి జెంది యుండినవి. పెక్కుసంఘారామములు కొండసానువులందు గదులవంటి చిన్నగుహలను తొలచుటవలన నేర్పడినవి. ఈ గుహలలో వసించి బౌద్ధ భిక్షుభిక్షుణులు పరిసరప్రాంతప్రజలకు బౌద్ధధర్మమును బోధించెడి వారు.

జైన బసను లాంధ్రదేశమున పెనుగొండయందును కొల్లిపాక యందును గలవని చెప్పుదురు; వాస్తునిర్మాణవిధానమున నందేమేని విశేషములు గలవేమో తెలియదు. ప్రాచీన జైన దేవాలయములు కొన్ని యాంధ్రదేశమం దచట నచట గానవచ్చుచున్నవి. ఇందు హనుమకొండ యందలి పద్మాక్షీదేవాలయ మొకటి; హంపీ విజయ నగరమున పాడుపడిన జైనదేవాలయములు మూడు నాలుగు కలవు.

పెక్కు జైన దేవాలయములను వైష్ణవులాక్రమించుకొని వానికి చక్రాంకితము జేసిరి. ఆంధ్రదేశమున గ్రామగ్రామమున గానవచ్చు ప్రాచీన జైన విగ్రహముల శకలములను జూడఁగా నొకప్పుడీమత మాంధ్ర దేశమంతటను వ్యాపించి యుండెనని తోఁచుచున్నది. కాని ఇప్పటివఱకును నిలిచియున్న జైన దేవాలయములను పరిశీలించి చూడఁగా రూపమునను నిర్మాణ శక్తియందును నవి హిందూదేవాలయములను బోలినవే. కావున వానినిగూర్చి యిచట ప్రత్యేకముగ వివరింపవలసిన యావశ్యకత లేదు.

హిందూ దేవాలయముల యుత్పత్తినిగూర్చి పెక్కు సిద్ధాంతములు గలవు. వాని నన్నిటిని ఇచ్చట వివరింపవలసిన యావశ్యకత లేదు. కాని యొక్కదాని నిట చెప్పక తప్పదు. ఈ సిద్ధాంతమున ముఖ్యాంశములివి. భరతఖండమునం దెచ్చటను క్రీ. శ. ౨వ శతాబ్దము వఱకును హిందూదేవాలయముల పొడ కానరాదు. ఇది సహజమే. వైదిక యుగమున దేవాలయములు లేవు. ఆర్యులు విగ్రహారాధకులుగారు; వారికి దేవాలయములతో పని లేదు. దేవాలయనిర్మాణమును విగ్రహారాధనయు హిందువులు బౌద్ధులదగ్గరనుండి యెరవు తెచ్చుకొనిరి. తొలుత బౌద్ధులు బుద్ధునియొక్కయు నతని యనుచరులలో ఋషితుల్యులైన మహనీయుల యొక్కయు శరీరావశిష్టములమీద స్తూపములు నిర్మించి వానిని పూజించువారు. ఈ స్తూపము రానురాను మన దేవాలయమువలె రూపందినది. స్తూపములును విగ్రహారాధనయు జనసామాన్యముయొక్క ఆదరాభిమానమునకు పాత్రములై తన్మూలమున దేశమునందంతటను బౌద్ధమతమునకు ప్రాపక మెక్కుడగుటను గాంచి హిందువులును స్తూపములవంటి దేవతాయతనములను నిర్మించి యందు తమ దేవతల విగ్రహములను స్థాపించి వాని పూజాపురస్కారముల కొఱకు తగిన యేర్పాటులను గావించిరి. ఇట్లు బౌద్ధులకడనుండి దేవాలయ నిర్మాణమును విగ్రహారాధనయు నేర్చుకొనిరి.

ఈ సిద్ధాంతమును అందఱును నొప్పుకొనరు. దీనికి ప్రబలమైన

యాక్షేపములుగలవు. వానినిచ్చట లెక్కింపవలసిన యావసరములేదు. సత్యాత్మకమైన విషయమునొక్కదానిని నిచట గ్రహించినచాలును. దక్షిణదేశమున క్రీ. శ. ౭వ శతాబ్దమునకు ముందు హిందూదేవాలయములులేవు. దక్షిణదేశమనగా తమిలునాడని మనమర్థము చేసికొనవలయును. ఏలయనగా నాంధ్రదేశమున ముఖ్యముగ తీరాంధ్రమున సాలంకాయన పల్లవ విష్ణుకుండిన రాజులకాలమున హిందూదేవాలయము లుండినట్లు వారిశాసనములు రుజువుసేయుచున్నవి. వేంగి చిత్రరథస్వామిని, దాలూరు నారాయణదేవుని, కందుకూరి విష్ణుదేవుని మీరు స్మరణకు దెచ్చుకొనవలయును. ఆంధ్రదేశమున నిట్లు దేవాలయములున్నను, ఆకాలమున తమిలుదేశమున నెచ్చటను దేవాలయములుండెననుటకు సాక్ష్యములేదు. తమిలుదేశమున దేవాలయనిర్మాణములనాచరణకు దెచ్చినవాడు కాంచీపుర పల్లవాధీశ్వరుడు. మొదటి మహేంద్రవర్మ. కడుప్రాచీనుడగుటచేత మహేంద్రవర్మ వృత్తాంతము మనకు సవిస్తరముగ దెలియదు; కాని మన కుపలబ్ధమైన చరిత్రాధారములనుబట్టి చూడగా నతడు విక్రమాదిత్య భోజ కృష్ణరాయల యుద్దివాడని చెప్పవలయును. మహేంద్రవర్మ విద్వాంసుడు. కవి నాటకకర్త. మత్తవిలాసమను ప్రహసనము రచియించి తనకాలమున ప్రచారమునందున్న మతదురాచారములను ఖండించెను; భగవదజ్జుకమను మఱియొక ప్రహసనమును గూడ నీమహారాజు రచియించెనని చెప్పుదురు. మహేంద్రవర్మ చక్కని సంగీతశాస్త్రజ్ఞుడు. ఇతని గురువగు రుద్రాచార్యునిచే రచియింపబడిన సంగీతగ్రంథము నొక్కదానిని కుడిమియామలై యనుచోట ఱాతిపై చెక్కించి తనగురుని గాంధర్వకళానైపుణ్యమును లోకమునకు విదితముగావించినాడు. అన్నిటికంటె నితనికీర్తి దేవాలయనిర్మాణమువలన లోకమున స్థిరముగ నెలకొనినది. తమిలుదేశమున నెక్కటావులయందు కొండల దొలిపించి బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు గుహాలయములను నిర్మించినాడు. తమిలుదేవాలయనిర్మాణమున కిట్లుమహేంద్రవర్మ పునాదులను వైచినాడు. ఇతనిసంతతివారును వారి తరువాత తమిలుదేశమును పాలించిన చోళచక్రవర్తులును నీపునా

ములపై యద్భుతమగు దేవాలయములను నిర్మించిరి. ఇప్పుడు లోకమున ప్రఖ్యాతినందిన త్రివిధ దేవాలయరచనరీతులలో ద్రావిడరీతి వీరి మూలమున పరిణామమందినది.

ఇంతదూరమిచట మహేంద్రవర్మయొక్క గొప్పగుణముల నేల వర్ణించితి ననఁగా నతఁ డాంధ్రుఁడగుటచేత. కంచిరాజధానిగ పాలించుచుండిన పల్లవ వంశమున క్రీ. శ. ౬ వ శతాబ్దమున నుత్పన్నమై పోయెను. తరువాత తీరాంధ్రమును పాలించుచుండిన పల్లసింహావిష్ణువు కంచిసింహ విష్ణువు కంచిసింహాసనము నధిష్ఠించెను. ఈ సింహావిష్ణువు కుమారుఁడే మన మహేంద్రవర్మ. తీరాంధ్రమున గానవచ్చు నతని శాసనమును బట్టియు, ఇతర స్థలములందు గానవచ్చు శాసనములలో గానవచ్చు తెనుఁగు బిరుద నామములవల్లను మహేంద్రవర్మ తెనుఁగు వాఁడనియు నతని రాజ్యము త్తరమున కృష్ణాతటము వఱకును వ్యాపించియుండెనని చరిత్ర పరిశోధకు లభిప్రాయపడు చున్నారు. మహేంద్రవర్మ తెనుఁగునాఁటనేలిన తెనుగు ప్రభుత్వమని మనము విస్మరించినను అతనిచే నిర్మాపితములైన గుహాలయము లావిషయమును మరువనీకున్నవి. కృష్ణాతటమున ఉండవల్లి మొగలారాజాపురములందు గానవచ్చు విష్ణుకుండిన గుహాలయములతో దమకు జ్ఞాతిత్వము నుద్ఘోషించుచున్నవి. శిల్పవిద్యా విశారదులైన పరిశోధకులు పల్లవగుహాల శిల్పవైఖరిని ఉండవల్లి మొగలారాజాపుర గుహాశిల్పరచనా విధానముతో బోల్చిచూచి, పల్లవమహేంద్రవర్మ తనరాజ్యపు టుత్తరప్రాంతమున గానవచ్చు గుహలనుగాంచి వానిని మేలుబంతులుగ గ్రహించి తమిళదేశమున వానివంటి గుహాలయములను నిర్మించెనని సిద్ధాంతీకరించియున్నారు. ఈ సిద్ధాంత మందరిచే నంగీకరింపఁబడినది.

ఇట్లు దేవాలయ నిర్మాణ విద్యను తమిళులు తీరాంధ్రమునుండి వడసినను నేడు తీరాంధ్రమున ప్రేలుమడచి పేర్కొనదగిన దేవాలయ మొక్కటి యేనియు లేకపోవుటవిచిత్రము. అంతకుమించిన చిత్రము ద్రావిడ కర్ణాటక దేశములయం దొక్కొక దానియందును ప్రతి

దేవాలయ నిర్మాణరీతు లేర్పడియుండ ఆంధ్రదేశమున నట్టిదేదియు లేకపోవుట-ఇప్పుడాంధ్రదేశమున రెండుపద్ధతుల ననుసరించి కట్టిన దేవాలయము గానవచ్చు చున్నవి. దక్షిణ పశ్చిమాంధ్రములయందు గానవచ్చునవి యన్నియు ద్రావిడ పద్ధతిననుసరించి కట్టబడియున్నవి. తీరాంధ్రమున వాస్తునిర్మాణ దృష్టిజూచిన విశేషించి కొనియాడదగిన దేవాలయము లెవ్వియు లేవు. అమరావతీ ద్రాక్షారామము చాళుక్య భీమనగరము మున్నగు సుప్రసిద్ధ పుణ్యక్షేత్రము లందలి యాలయములు ద్రావిడ రీతిననుసరించి కట్టబడినవి. అచ్చట నుత్కళ ఛాయలుగానవగును. సింహాద్రియప్పన్నయాలయము సగము సాలెనేత నగము మాల నేతయన్న న్యాయప్రకారము ద్రావిడోత్కలు కలిసి సంకీర్ణమై యున్నది. మంగళగిరి నరసింహుని గోపురము కేవలముత్కళరీతిఁ గట్టబడియున్నది. ఉత్కళపద్ధతి ప్రకారము గట్టఁబడిన యాలయములు మఱికొన్ని గుంటూరుమండలమున కలవు. రాయలయుగమున రాయసామ్రాజ్యమున విజయనగర పద్ధతియొకటి పొడచూపినది. కాని ఇది ద్రావిడ దేవాలయ పరిపూర్ణమేగాని ప్రత్యేక నిర్మాణపద్ధతి కాదని పరిశోధకులు చెప్పుదురు. కావున ఇచట విజయనగర పద్ధతినిగూర్చి వేఱుగ చెప్పవలసిన యక్కఱలేదు.

ఇఁక తెలంగాణమువైపు దృష్టిని మరల్తము. ఇచటగానవచ్చునది చాళుక్యపద్ధతి. ఇది సహజమేకదా. తీరాంధ్రమునకును తెలంగాణము కూడలియని చెప్పియుంటినిగదా; మఱియు సాతవాహన కాకతీయ కుతుబుశాహీరాజుల కాలమునదప్ప, చరిత్ర పొడగునను తెలంగాణ మాంధ్రదేశమున గలియక వేర్పడి కర్ణాటక సామ్రాజ్యమునం దంతర్గత మయ్యుండెనన్న విషయమును వినియున్నారుకదా. ఇఁక తెలంగాణ వాస్తవ్యులకును వారిచే బెంపొందింపఁబడిన సంస్కృతికిని గర్ణాటకుల పోలికలుగలుగక తప్పుటయెట్లు?

కర్ణాటక దేవాలయ నిర్మాణపద్ధతి స్వచ్ఛమైనది కాదనియు నది ద్రావిడ యుత్తరహిందూస్థాన పద్ధతుల కలయికవలన నేర్పడినదనియు

వాస్తుశాస్త్ర మర్మజ్ఞులయభిప్రాయము కావచ్చును, దీనినిగూర్చి ఇచట మనము వాదులాడవలసిన యవసరములేదు. కాని ద్రావిడ చాళుక్య పద్ధతులకు గలభేదమును స్థూలముగ నందరికిని దెలియు దానిని పేర్కొనవలసిన యావశ్యకత కొంతకలదు. ఉన్నత గోపురవిమానముల విశాల మంటపములను, ద్రావిడదేవాలయముయొక్క ముఖ్యలక్షణములు, చాళుక్య దేవాలయము చెక్కడపుపని ప్రాముఖ్యమువలన వాసికెక్కినది. ఒక దానియందు వాస్తు నిర్మాణకౌశల్యము పరిపూర్ణతనందినవి. రెండవ దాని శిల్పచాతుర్యము వెల్లివిరిసినది. ఇది ఈరెండుపద్ధతులకు గల ముఖ్య భేదము. ఈభేదమును గ్రహించితిమేని ఈ రెండుపద్ధతుల తత్వము చక్కగబోధకాగలదు.

చాళుక్య దేవాలయచరిత్ర బాదామిచాళుక్యుల నాడారంభమైనది; రాష్ట్రకూటుల ఏలుబడిక్రింద బెంపందినది. కల్యాణి చాళుక్య రాజులకాలమున వికసించినది. హొయసలుల కాకతీయుప్రభువు పాలనమున నూతనపరిణామము నందినది. కాని చాళుక్యదేవాలయ చరిత్ర మనకంతగ దెలియరాదు. దీనికొక ముఖ్యకారణము. చాళుక్యరాజులేలిన రాష్ట్రములో జాలభాగ మిప్పటి హైదరాబాదు సంస్థానమంతర్గతమైయున్నది. ఇచటిపరిస్థితి మీకందరకును దెలిసినదేకదా. మొన్న మొన్నటివరకును హైదరాబాదు రాష్ట్రమంతయు నొకదుర్భేద్యమైన ఉక్కుతెరచాటున మరిగియుండినది. ఇప్పటి ప్రజలపరిస్థితులే బహిః ప్రపంచమునకు దెలియరాకయుండెనట, ప్రాచీన హిందూదేవాలయముల మాట చెప్పవలయునా? కాని నిర్మాణసౌందర్యమునను శిల్ప చాతుర్యమునను జగత్ప్రసిద్ధినందిన హొయసలుల దేవాలయములకు తుల్యమైనవియు వానిని మించినవియు చాళుక్యకాకతీయ నిర్మాణములు పెక్కు తెలింగాణమున గలవని వినికిడి. ఇది గాలివార్తకాదని తలంచెదను. వానినన్నిటిని బయలుపెట్టి యాంధ్రవాస్తు నిర్మాతలయొక్కయు శిల్పులయొక్కయు కీర్తిని పునఃప్రతిష్ఠ సేయవలసినభారము తెలింగాణాంధ్రుల మీదనున్నది.

ఇక మనపూర్వుల గృహనిర్మాణమును గూర్చి ఇంచుక చెప్పవలసి యున్నది. సామాన్యజనులు ఇప్పటివలెనే అప్పుడును పూరి కొంపల యందే నివసించుచుండిరి. ఆంధ్రవాఙ్మయమువలన నానిటీరు కొంత తెలియవచ్చుచున్నది. ౧౬ శతాబ్దమున కృష్ణదేవరాయలును ౧౭ నందు కదిరీపతియు తమ ఆముక్తమాల్యద శుకసప్తతులలో సామాన్య జనుల నివాసములను వర్ణించియున్నారు. వాస్తునిర్మాణదృష్టి జూచిన వానిగూర్చి విశేషముగ చెప్పదగినయంశము లెవ్వియులేవు. అప్పటి రాజమందిరములు కొన్ని, శిథిలావస్థయందున్నను, నేటికిని నిలిచి యున్నవి. హంపి విజయనగరమున రాచనగళ్లన్నియు మహమ్మదీయులచే నేలమట్టము గావింపబడినవి; కొన్ని క్రీడామందిరములు నిలిచి యున్నవి. అందు రాణీగారి మజ్జనగృహమును పద్మప్రాసాదము (Lotus malat)ను ముఖ్యమైనవి. ఇందు మహమ్మదీయ నిర్మాణపద్ధతి జాడలు గానవచ్చుచున్నవి. నిరంతరము తురకలతో ఘోరయుద్ధములు జరుగుచుండినను, రాయలయుగపు వాస్తునిర్మాతలు తురకల ప్రాసాద నిర్మాణపద్ధతియందు తమకునచ్చినయంశములను స్వీకరించిరని తెలియ వచ్చుచున్నది. ఇవిగాక పెనుగొండయందు కృష్ణరాయల గగనమహలును చంద్రగిరియందలి రాజమందిరములు నక్షై నిలిచియున్నవి. తమిళదేశమునందు మననాయకరాజులు నివసించుచుండిన సౌధములును చక్కని స్థితియందున్నవి. జింజి తంజావూరములందు సంపూర్ణముగను మధుర యందొకభాగమును నిలిచియున్నవి. అప్పటి యాంధ్రుల సౌధనిర్మాణకౌశలము వీనివలన విశదముకాగలదు. తిరుమలనాయకుని ప్రాసాద సౌందర్యమునుగూర్చి మీరందఱువినియేయుందురు.

## శిలాప్రతిమలు.

దేవాలయములకును శిలాప్రతిమలకును అవినాభావసంబంధము కలదని ఇంతకుముందె చెప్పియున్నాను. శిలాప్రతిమలను మన పూర్వులు గండారపు బొమ్మలు లేక గండారములని పేర్కొనువారు. గండారము గండరించు అను క్రియనుండి పుట్టిన నామవాచకము,

గండరించుట అనగా ఱాతిని మలిచి విగ్రహముసేయుట యని యర్థము. ఇవి మూడు తెరగులవి- శిలాతలమునీద స్వరూపమాత్ర మగుపడునట్లు పైపై మలిచినవి. వీనిని ఇంగ్లీషున Low relief అందురు. ప్రతిమాబింబము సగమగపడునట్లు చెక్కినవి. వీనిని Half-relief అం దురు, సంపూర్ణముగ శిలాబింబమును విడివడసేసి చెక్కినవి- వీనిని Sculpture in the round అందురు. ఈమూడురకములగండి గండారపు బొమ్మలును మనదేవాలయములందు గానవచ్చును. వీని సౌందర్య మును గూర్చియు శిల్పినైపుణ్యమునుగూర్చియు నిచట పరామర్శింప దలపెట్టలేదు. ఇప్పటికే కొండవీటి చేదంతాడైనది ఈయుపన్యాసము. మీాయోపిక యెప్పుడో తరిగిపోయియుండును మీాకు విసుగుబుట్టి యుండుననుటకు సంశయములేదు. కాని ఈగండారపులు చరిత్రకారుల కమూల్యములైన యాధారము. అవి ఈ తెలంగాణదేవాలయములలో ద్రవ్యోత్తండములుగ గానవచ్చుచున్నవి. అజ్ఞానము వల్లను మతావే శము వల్లను అవి చాల చెడినవి ఇంకను చెడగలవు. అవి మన పూర్వులు శతాబ్దములక్రింద మనజాతికొఱకు నిక్షిప్తము జేసిపోయిన కాణయాచి. వానిని రక్షించు భారము మీాశిరములపై నానియున్నది- మరువవలదు- మరువవలదు- మరువవలదు.

ఇవి పూర్వచరిత్ర నెట్లు విదితముసేయునో యొకటి రెండు మాటలలో సెప్పెదను. దేవతా ప్రతిమలు చరిత్రకారుల కంతగ నుప యోగింపవు. ప్రతిదేవాలయపుమంటపములందును, గోడలమీాదన పాకా రోపరితలమునను అలంకరణార్థము చెక్కబడిన ప్రతిమలవ్యారిగ గానవ చ్చును. శిల్పులీ తరగతి ప్రతిమలవూతృకలునుసమకాలికసంఘజీవనము నుండి గ్రహించువారు, ఒక యుదాహరణమువలన నాయభిప్రాయమును తెల్లముసేయుచాన్నాను. హంపీ విజయనగరమున హజారరామస్వామి గుడియను దేవాలయముగలదు. హజారనగా వేయి అని అర్థముగాదు. ఇది తెనుగుమాట- రాయలవారినగరి హజారమున అనగా ద్వార మండపమువలన దీనికాపేరు వచ్చినది. ఈ దేవాలయ ప్రాకారము

మీద అప్పటి విజయనగర ప్రజల- ముఖ్యముగ నంతఃపురజనుల- దైనం దిన చర్యలు క్రీడలు మున్నగు విషయము ప్రతిమారూపమున ప్రదర్శింపబడియున్నవి. వీనిని పరిశీలించి చూచితిమేని అప్పటి వారెట్టిదుస్తులను దొడిగికొనిరో యెట్టి యాభరణములను ధరించిరో, యెట్లువిహరించిరో ఏయే క్రీడలయందాసక్తులై యుండిరో, యేరీతిప స్త్రీపురుషుల నృత్యము ప్రేమించిరో, యే తెఱగున పోట్లాడిరో మన కన్నుల ముందు పొడకట్టును. రాజకీయములమాట నట్లుండనిండు- సంఘజీవన చరిత్ర రచయితలకివి యెంతటి యమూల్యసాధనములో మీకెరిగితములు కాఁగ లవు. ఇట్టి ప్రతిమలు మన దేవాలయములందును- ముఖ్యముగచాళుక్య కాకతీయ నిర్మాణములయందు కలవు. వీని రక్షించుటకు వీనికి సరియైన ప్రతిబింబములను తీయించి ఆంధ్రుల శిల్పవిద్యాశోభనలోకమున ప్రసరింపజేయుట మీవిధి.

ఇక సంగీతమునుగూర్చి సంగ్రహముగ నాలుగుమాటలుచెప్పి ఈదీర్ఘోపన్యాసము నింతట చాలించెదను. కర్ణాటక సంగీతమును మీరు వినియుందురు. కర్ణాటక సంగీత మన కన్నడ దేశసంగీతమని మీరు భ్రమజెందెదరేమో- వాస్తవముగ నది తెనుగుసంగీతము. కవిసార్వభౌముఁడగు శ్రీనాథుని కవిత్వ కర్ణాటభాష యైనట్లిదియు కర్ణాటక సంగీతమైనది. విజయనగరసామ్రాజ్యమునకు కర్ణాటసామ్రాజ్యమని నామాంతరము- కాని యాసామ్రాజ్యమును స్థాపించినవారును, వారి యాశ్రయముక్రింద కర్ణాటకసంగీతమును పెంపొందించినవారును తెనుఁగువారే. లభించిన గ్రంథసాక్ష్యమునుబట్టి చూడఁగా కాకతీయులనాటికే గాంధర్వకళ యాంధ్రదేశమున జక్కఁగ నభివృద్ధియైయుండెనని తోఁచుచున్నది. రెడ్డి వెలమరాజులు సంగీతమునందభిరుచిగలవారై గాంధర్వవిద్యావిశారదులనుపోషించిరి. కాని సంగీతమభివృద్ధియైనది విజయనగర రాయలసంస్థానమందే. ఇమ్మడి కంపరాయలు ప్రౌఢదేవరాయలు మల్లికార్జునరాయలు, సాళువ నరసింగరాయలు, కృష్ణదేవరాయలు, అచ్యుతదేవరాయలు, అళియరామరాయలు, తిరుమలరాయలు, ఇమ్మడి

వెంకటమఖిరాయలు మున్నగువారల్లు గ్రంథములు వ్రాసిరి. వీరి
యాశ్రయమున సోమప్ప, అల్లాళనాథుఁడు, సాళువగోపతిప్పరాజు, తాళ్ళ
పాకమువారు కల్లరసు, బండారు లక్ష్మీనారాయణ, బయకార రామ
ప్పయ్య మొదలైనవారు సంగీతశాస్త్రము బరిశీలించి నూతనగ్రంథము
లను విరచించిరి. ఈమహనీయుల కృషి కే ఫలితముగ విజయనగర సంస్థాన
మందు సంగీతము జక్కఁగ నభివృద్ధినందినది.

క్రీ.శ. ౧౫౬౪-౬౫సం॥న జరిగిన రక్కసితంగడి మహాసంగ్రామము
నకు తరువాత రాయసంస్థానము ఖిలము గాకపోయినను విజయనగ
రము క్రమముగ క్షీణింపసాగినది. రాయ రాజధాని మొదట పెను
గొండకును, తరువాత చంద్రగిరికిని, కడపట రాయవేలూరునకును
మార్పబడినది. దక్షిణమున అరవదేశమందు జింజీతంజాపుర మధురా
నగరములందు నాయకరాజ్యములు ప్రబలినవి. విజయనగరము నుండి
కవిగాయకి నటనటీజనులు దక్షిణరాజ్యములను జేరి యాచట నాయక
రాజులనాశ్రయించిరి. నాయకరాజ్యము లన్నిటియందును తంజ నగ
రము సుప్రసిద్ధమైది. ఇతర నాయకరాజులకంటె తంజాపుర ప్రభువు
లకు గళాభిమాన మెక్కుడు. వీరి యేలుబడిక్రింద తంజ యొక గొప్ప
యాంధ్రవిద్యా పీఠమాయెను. నాయకరాజులలో బేరెన్నిక కెక్కిన
వాడు రఘునాథ నాయకుఁడు. ఇతఁడాంధ్ర గీర్వాణములు రెంటి యం
దును ప్రతిభాశాలియైన కవి; చక్కని ద్వాంసుఁడు; సంగీతకళా
కోవిదుఁడు, మంచివైణికుండు. ఇప్పుడు ప్రచారమునందున్న వీణకు
రఘునాథవీణ యనిపేరు. తత్పూర్వము వైణికులు ఒక్కొక్క రాగము
నకును వీణమెట్లను జతిపితంతువుల సవరించుకొన వలసి వచ్చుచుండెడిది. ఈ
యంశమును అల్లసాని పెద్దన్న గారిట్లు సూచించియున్నారు.

> 'వాలారుంగొనగోళ్ళనీవలసతన్ వాయించుచో నాటకున్
> మేళంబై సవిపంచి నిన్న మొదలింక వ్రాటమిన్ జేసియా
> యాలాపం బెయు వేళ బల్కెడు ప్రభాతాయాత తాతాహతా
> లోలత్తంత్రుల మేళవింపగదవే లోలాక్షి దేశాక్షికిన్'

ఇట్లు మాటిమాటికి తంత్రుల మేళవింపవలసిన యావశ్యకతను దొలగించి వీణను స్థిరపరచినాఁడు రఘునాధనాయకుఁడు. మఱియు రఘునాధుఁడొక సంగీతసుధయను నొక సంగీతగ్రంధమును రచించెను. మఱియు నితనిమంత్రి గోవింద దీక్షితులును; అతని పుత్రులు యజ్ఞనారాయణ దీక్షిత వెంకటమఖులును సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు. వీరు బడగలనాటి కన్నడిగలు ; ఆంధ్రబ్రాహ్మణుల యందొక శాఖకు జెందినవారు. సంగీతనిపుణులు. వెంకటమఖి చతుర్దండి ప్రకాశికయను సంగీత శాస్త్రగ్రంధమును రచించెను. రఘునాధనాయకునివలె విజయరాఘవుఁడును కవికళాప్రియుఁడు. ఇతఁడు పెక్కుద్విపద కావ్యములను యక్షగానములను, గేయములను వ్రాసెను. ఇతనిభార్య రంగాజమ్మ్నారు దాసవిలాసమను యక్షగానమును విరచించెను. మఱియు దక్షిణాపథము నందంతటను నద్వితీయ సంగీత విద్వాంసుఁడను, ప్రఖ్యాతి నందిన క్షేత్రియ విజయరాఘవుని సమకాలికుఁడు. ఇతఁడు గోలకొండ అబుల్ హసన్ పాదుశాహు నాస్థాన సంగీత విద్వాంసుల నోడించి యతనిచే సత్కారములను బడసినను, ఇతనికి ముఖ్యముగ నాశ్రయ మొసఁగి ప్రోత్సహించినవారు దాక్షిణాత్యాంధ్ర నాయకులే. మధుర తిరుమల నాయకుడు, తంజాపుర విజయరాఘవుడు, తుపాకుల కృష్ణప్ప నాయకుఁడు మున్నగు ప్రభువులందరును ఇతని పదములు జెప్పించుకొని సమ్మోద మందిరి.

నాయకరాజుల కృషిచే తంజాపురము కళలకిరవాయెను. గాంధర్వవిద్య కాటపట్టాయెను. కాని యచటికవులు, గాయకులు, పాఠకులు; భరతశాస్త్రోపాధ్యాయులు, నటులు వీరువారననేల లలితకళోపాసకులెల్లరు తెనుఁగువారే. ఈకారణముననే నాయకరాజులు గతించినవెనుక వారిస్థానమున రాజ్యపాలనమొనర్చిన మహారాష్ట్ర ప్రభువులుగూడ తెనుగును నేర్చి తెనుఁగున గ్రంథములు రచించి గాంధర్వాది లలితకళా విశారదులను గౌరవింప వలసివచ్చెను. కీర్తన బ్రహ్మ త్యాగరాజు మహారాష్ట్ర రాజులకాలమున వెలసెను. ఇట్లు ఆంధ్రులు పెంపందించిన గాంధర్వవిద్య అరవలకు సంక్రమించినది.

తమిలు దేశమునం దంతకాలము జరిగిన మన ప్రభుత్వచిహ్నముగ మన పూర్వులు వారికి గాంధర్వవిద్యాదాన మొసఁగిరి. వారుదానిని చక్కఁగ పోషించి తమ కాణయాచి చేసికొనిరి. మనము దానిని సంపూర్ణముగ విస్మరించితిమి. ఈచేత్తో చేసిన దాన మాచేతికి దెలియగూడదుకదా!

సమాప్తము.

—...—

వ్యాససంపుటం.

# ఆంధ్రభారతీ
# తీర్థము

ఆంధ్రా రెసెర్చి
యూనివర్సిటి

1928

# అవతారిక.



అభినవ ప్రపంచమందలి యున్నతవిద్యావిషయక వ్యాసములను ప్రసంగములను ప్రకటించు నాశయమునసనుసరించి యాంధ్రభారతీతీర్థమను ఆంధ్రరీసర్చి యూనివర్సిటీ పక్షమున శబ్దశాస్త్ర తత్వబోధకమగు పాశ్చాత్యపండిత ప్రసంగమును అనువాదము చేయించి యిందుప్రకటించడమయినది. అనువాదకర్తలగు ఆంధ్రభారతీ తీర్థోపాధ్యాయులకు కృతజ్ఞతా పూర్వకవందనములు. [illegible] ప్రకటన మితరపండితులునిట్టి యనువాదములనుచేయుటకు ప్రోత్సహించునుగాక.

[illegible] నవంబరు 1928<br>[illegible]<br>[illegible]

[illegible]<br>ఆంధ్రభారతీ [illegible].

# ఉపోద్ఘాతము.

కొలంబియా విశ్వవిద్యాలయమున ఇండో-యూరోపియన్ భాషా పండిత పీఠమునలంకరించిన ఏ. వి. విలియమ్సు జాక్సన్ మహాశయుని భాషాతత్త్వశాస్త్రమును గూర్చిన వ్యాసరాజమును శ్రీశ్రీశ్రీ విజయనగరం మహారాజావారి సర్వకళాశాలయందాంగ్లేయ భాషోపన్యాసకులును, నాంధ్రభారతీతీర్థ ప్రధానులును, డాక్టరను నాచార్య బిరుదాంకితులును నగు మ. రా. రా. బుఱ్ఱా శేషగిరిరావు పంతులు యం. ఏ. పి. ఎచ్. డి. గారి యాదేశముపైని యాంధ్రీకరించితిమి. ఇట్టి వ్యాసములు శాస్త్రీయములగుటను, పారిభాషిక పదభూయిష్ఠములగుటను భాషాంతరీకరణ సౌలభ్యములు కానేరవు. ఐనను దీనినాంధ్రీకరించుటలో ప్రతిపదార్థ ప్రయత్నమును మాని యందలి ప్రతివాక్యముయొక్క భావము చెడకుండ మానేర్చినకొలంది నాంధ్రీకరణమొనర్చితిమి. ఇందలి విషయము సకల భాషాసేవకుల కత్యంతోపయుక్తమగుటను, ముఖ్యముగ విద్వాన్- శిరోమణి మొదలగుపరీక్షలయందుత్తీర్ణులై ప్రాచ్యపండిత బిరుదపట్టాభ్యర్థుల కవశ్యపఠనీయమగుటను దీని నాంధ్రీకరించుట ముఖ్య కర్తవ్యమని యెంచియథాశక్తి నాంధ్రభాషా పరివర్తనము గావించితిమి. ఇందలి గుణములను గ్రహించి దోషముల మన్నింప గుణగ్రహణ పారీణులగు పాఠకమహాశయుల బ్రార్థించుచున్నారము.

ఇట్లు బుధజన విధేయులు
మహాభాష్యం సుబ్బారాయుడు బి. యే. యల్టీ.
భమిడిపాటి సూర్యనారాయణశాస్త్రి
ఆంధ్రభారతీ తీర్థోపాధ్యాయులు.

తుని
సెప్టెంబరు 1924

# శబ్దతత్వశాస్త్రము.

I ఒకప్పుడాంగ్లేయ మహానాటక రచయితయగు షేక్స్పియరు మహాకవీంద్ర ప్రణీతమగు హేమ్లెట్టు నాటకమందలి కల్పిత పాత్రమగుహేమ్లెట్టు "మాటలు, వ్యర్థపుమాటలు, ఉత్త మాటలు" నియుమ్మారు పలికెను. ఈవిషయమునుగూర్చి బాగుగ తెలియనివారు కొందఱు, శబ్దతత్వశాస్త్రము కేవలపదములగూర్చిమాత్రము దెలుపు శాస్త్రమనియూహింప వచ్చును. అదియట్లుకాదు. అన్వేషించిన యెడల, భూతచరిత్రద్యోతకములునుసుసంపన్నములగు నుత్త మాటలే యమూల్య జ్ఞాపక చిహ్నములుగ భద్రపరచనగు జయధ్వజములుగనున్నవి. ఏలనన యుగాంతరములనుండియు జ్ఞాన యుద్ధములలో జయముగాంచిన మానవహృదయముల జయోద్రేకములనవి దెలుపుచున్నవి. నిజమగు శబ్దతత్వవేత్త కేవలభాషావిదుఁడు మాత్రమె కాడు. తనవిధ్యుక్తకార్యముల నిర్వహించువాడగు నెడల నతఁడంతకంటె నధికముగనుండవలెను. అత్యల్ప పదములయొక్కయు, మిగుల చిన్నయుపసర్గలయొక్కయు, కడుహీనములుగ గన్పట్టు స్వల్పవర్ణములయొక్కయు, లేక స్వకీయజ్ఞానవిశేషముచే విభజింపననువగు ధ్వనిమాత్రముల యొక్కయు, నత్యల్ప పరమాణువుల యొక్కయు తూచాలు తప్పకుండెడి మిగుల సరియగు వివరములతో నావృతుఁడై, యాతఁడందుకుగాను, చరిత్రకారుఁడో, తత్వజ్ఞానియో, తార్కికుఁడో, శారీరశాస్త్రజ్ఞుఁడో, మానసికశాస్త్రవేత్తయో, సంఘ విషయజ్ఞానియో, వానితోపాటు మతపరస్పర సంబంధవేత్తయో, మతమునకు తోడు నిరంతరపరిశోధకుఁడో, నిష్పక్షపాతియగు న్యాయనిర్ణేతయో, యయియుండసిద్ధముగ నుండవలెను. నిజమయిన శబ్దతత్వశాస్త్రవేత్తయొక్క సత్యాదర్శనములిట్టివిగనే యుండును.

2 శబ్ద తత్త్వ విచారణాశక్తి స్థిరముగను, గాఢముగను వృద్ధియగుచున్నది. శబ్దతత్త్వశాస్త్రపట్టిక గల చక్కని గ్రంథము నేఁడైన పరిశోధించు నెడలవందలకొలఁదినియీశాస్త్రసంబంధములగు మాసపత్రికలు విద్వత్సంఘ వ్యాపారములు, మొదలగువాని నామములు కనుఁగొనఁబడును. ఇంకను సాధారణపత్రికలు, ప్రత్యేకపత్రికలు తాత్కాలిక శబ్దశాస్త్రసంబంధ నివేదికలును వీనితోఁ జేరుచున్నవి. మఱియు పైవాని నైరోపా, యమెరికాఖండముల యందేగాక యీజిప్టు, ఇండియా, జావా, చైనా, జపానులలోను, ప్రతివత్సరము ప్రకటింపంబడు నేతత్ శాస్త్రవిషయకోపన్యాసములును పండితవిరచిత ప్రసంగావళులును, విడిగ్రంథములును, నసంఖ్యాకముగనున్నను వానినిఁగూర్చి తెలుపనేలేదు. ఇంతియగాక శబ్దశాస్త్రవిషయావబోధక పేటిక సహాయమునొప్పు యిండోయూరోపియన్ భాషల ప్రత్యేకవివరముల సంగ్రహమైన యమూల్యగ్రంథమాల యొకటి వెలువడగలదని నిరీక్షించుచుంటిమి. భాషావిషయేతరవర్గములయందుఁగూడ నిట్టి సంక్షేపగ్రంథములు వెలువడగలవు.

3 విశేషించి యీశాస్త్రవిషయక పరిషత్తులకు విద్యాంశములు ప్రతివత్సరము సమావేశమగుచుండుటయో, నియమితకాలములయందు తద్దేశీయ మహాజనసభలయందుచేరి శబ్దతత్త్వవిషయక సర్వతోముఖయత్నములనుగూర్చి ముచ్చటించుచుండుటయో జరుగుచుండును. శబ్దతత్త్వజ్ఞుఁడు నిర్ణయించవలసిన పెక్కువిషయములపైననేక ప్రధాన సమస్యలాధారపడియుండుట తరుచు తటస్థమగుచుండును. ఈవిషయమును చరిత్రకారులును, అధ్యాత్మిక విద్యాపరిణతులును, చక్కగ గ్రహింపవలఁతులుగనున్నారు. ఇంతయగాక కేవలశబ్దతత్త్వవేత్తల పరిశ్రమల ఫలితమగునిఘంటువులను మాటలయొక్క గుణితమునకుగాని, నిర్వచనములకుగాని, వ్యుత్పత్తులకుగాని, యనుదినమును చూచుచుండవలసియుండును. ప్రమాణగ్రంథములయొక్కయు, ప్రత్యేకనిఘంటువులయొక్కయు సంఖ్య వానియందలి యమి

జనసంఖ్యవలెనే దినదినప్రవర్ధమానమగుచున్నది. ఫ్రాన్సు, జర్మనీ, యింగ్లాండు, అమెరికా, దేశములయందు గతయిరువది సంవత్సరములకాలమున రచియింపఁబడిన నిఘంటురాజములనుగూర్చి స్మరించిన మాత్రమున పైవిషయము తేటతెల్లమగుచున్నది. మానవ సంఘాభివృద్ధి కతిగావించిన ప్రయోజనమునట్టి భాషవిశ్వమునకెల్ల నామోద సంధాయనియనియు, సర్వం సహావృత్తిశృంఖలమనియు, జగద్వ్యాప్తమనియు, తెలుపఁగును. జ్ఞానము సర్వమునకెకనువంటి వేదాంత వేత్తకు విషయమెల్లగునో, యట్లె శబ్దతత్త్వజ్ఞునకు సకల భాషలును విషయములుగ వెలయుచుండును. భాషాసంబంధమగు సర్వవిషయములును వానివినిమయమునకు కుతూహలజనకములుగాకుండకపోవు.

4. శబ్దతత్త్వశాస్త్రమనుమాట యిట్టిమహత్తరశబ్దము లనేకములకు, వలె నానార్థప్రతిపాదకముగనుండును. యథార్థముపరికించినచో, భాషామూలమున సంవ్యక్తమగు సర్వమునకును యీపదము వర్తించును. ఇయ్యది గ్రాంథిక, వ్యావహారిక, భాషాద్వయమునకు సమానముగ చెల్లుచుండును. జర్మని, ఫ్రెంచి, పండితులు సాధారణముగ నీవిపులార్థముండె యీపదమునుపయోగింతురు. నిశ్చయముగనిదియే సమంజసముగనున్నది. కాని యింగ్లాండు, అమెరికాముస్నగు కొన్ని దేశములయందీశబ్దార్థమును సంకుచితముగావింప యత్నించి, పరస్పరసంబంధ శబ్దతత్త్వమనియు వ్యాకరణపరిస్పర సంబంధమనియు, భాషాశాస్త్రమనియు, సామాన్యముగ భాషాతత్త్వమనియు వ్యవహరించు యత్నములు కనిపించుచున్నవి. యీశబ్దమట్లు సంకుచితార్థమున ప్రయోగించుటవలన కొన్ని ప్రయోజనములు కలవుకాని యీశబ్దము విపులార్థ ప్రయోగముగలదిగనుండుట యేయుక్తమనియు శబ్దతత్త్వజ్ఞునకు గోచరించువిషయములెల్ల దానివలననె స్ఫురించుటయు నేనుయిందొక్క వక్కాణించుచున్నాను.

[illegible] సర్వజనసామాన్యమునకు శబ్దతత్త్వము [illegible] ప్రసాదించిన పత్స[illegible]

ప్రధానమగు భాష మానవలోకముయొక్క సంస్థలను, వారినాగరిక ములను, వృద్ధిగావించిన బలిష్ఠహేతువుగ నెల్లరు పరిగణింతురు. చిత్రలేఖనము, సంగీతము, శిల్పము మొదలగు కళలుగాని, సంజ్ఞలుగాని పటములుగ తెలుపుభావద్యోతకములెల్ల నన్యోన్యభావ ప్రకటన హేతువులుగాన భాషయననొప్పును; కాని యీశబ్దమును సంకుచితార్థమున బ్రయోగించునెడల లిఖితవాగ్రూపక భాషాశాస్త్రమనియే చెప్పవలసియుండును. భాషకలిగియుండుటచేతనే మానవజాతి పశువర్గమునుండి వేరుచేయబడుచున్నది. దీనికలిమినే హామిలెట్టు తెలిపినట్టుల మనుష్యుడు జంతుజాలమున సర్వోత్కృష్టుడుగానున్నాడు. జంతువులు తనయరపులవలనను, యితరచిహ్నములవలనను, యన్యోన్యభావ ప్రకటననుగావించుచు, తమసుఖదుఃఖములను వ్యక్తపరుపగలవనికాదు. కాని సహజప్రేరితములగు వానియార్పులు, బుద్ధిజనితమానుష భాషకు కేవలభిన్నములుగనున్నవి. డార్వినుగారి సిద్ధాంతముననుసరించి మానవసృష్టికి పూర్వరూపము వాలిడికోతి మొదలగు వానరసృష్టియని కన్పట్టుచున్నది. కానివానర స్వరపరిశోధనలగావించి, యాధ్వనులను వాక్సంబంధములుగ నేర్పరచగావించిన శబ్దతత్త్వజ్ఞుల పరిశోధనలన్నియు విఫలములైనవి. అందువలననా సిద్ధాంతము భాషాప్రమాణహీనమయ్యెను. ఆసిద్ధాంతమును స్థిరపరచుటకు దుస్తరమగు నీయాటంకమువచ్చినది. గాన్నరు మొదలగు భాషాశోధకులు కొందఱు వానరముల శబ్దజాలమును తద్భాషాభేదములనుగూర్చి కృషిచేయుచున్నారు. కానివారి పరిశ్రమల ఫలితములు శాస్త్రసమ్మతములుగాకుండెను.

6 భాష కార్యసిద్ధిసాధనమని శాస్త్రజ్ఞులెల్లరకు తెల్లము. పరస్పరభావగ్రహణమె భాషోద్దేశము. ఈకార్యసాధనకభినయముండు [illegible]నాదులకంటెను మానుషవాక్కు బలియుమనియు నదిక్రమముగ కార్యనిర్వాహణ ప్రధానసాధనోత్తమముగ నభివృద్ధిగాంచినదని సులభగ్రాహ్యము. మానుషవాక్కును నీనశక్తితో ముఖ్యసాధనరాజ

ము కాలక్రమమున పెంపొందుచు, అప్పుడప్పుడభినయ ముఖవికారాదులతోఁగూడి యనంతశక్తి ప్రావీణ్యముల పొందిన దనిమాత్రము తెలిసినఁజాలును. దీనియద్భుతశక్తి వలనను, మనుజులకది ప్రసాదించునట్టి యద్భుతమానస పరిణామమువలనను, గ్రీకు దేశపు తత్త్వవేత్తల కాలము మొదలు నేటివరకునందు వేదాంతులెల్ల భాషోత్పత్తిక్రమమునుగూర్చి పలువురు పలువిధముల యోచించుచున్నారు. ఆ భాషోత్పత్తి దైవదత్తమా? అనుకరణావలంబితమా? ఆశ్చర్యార్థకాది ధ్వనిసంజనితమా? లేక, యన్యకారణోద్భవమా? యని శంకించుచున్నారు. కాని భాషోత్పత్తిక్రమమునుగూర్చిన యీ చిక్కుసమస్యకు యే విధమయిన సమాధానమును సమంజసముగను, సంపూర్ణముగను నుండ లేదు. కుక్క యనుటకు మాకు బౌ, బౌ, యనుదాని ధ్వన్యనుకరణమును బట్టి ధ్వనిస్ఫురణము కలుగునని యనుకరణ సిద్ధాంతమునుగాని, టంగుటంగను నాదమువలన ఘంటాస్ఫురణము కలుగునను డు పూ, పూ, సిద్ధాంతమువలనగాని, "ప్రేమోదయానంతరమున నాపై ప్రేమ చేసిననాడె నాకెరిగెను హోహోహోరా" మున్నగు గీతస్ఫురణము కలుగునను శ్రామిక గానసిద్ధాంతమువలనగాని, మరి యే యితరసిద్ధాంతమువలనగాని, యీ ప్రశ్నకు యుక్తమయిన సమాధానములు, కాజాలవు. పై సిద్ధాంతనామములు మాక్సుముల్లరు మొదలగు పండితులు ప్రయోగించియుండిరి. ఈ విషయమును హేర్డరు మహాశయుఁడు చర్చించినది మొదలు వెలువడిన యూహలన్నియు కొన్ని కారణములచే సమంజసములగుచున్నను, యీ సమస్య మిగుల కఠినమై, చిక్కైనదగుటచే జమిలి తాళములతో బిగించిన ధనాగారి ద్వారముల నొక్క తీగముతో తెరచుట యసాధ్యమగునట్లు, దురవగాహముగనుండెను. ఏమైనను మానవసాంఘిక జీవనమేర్పడిన నాటనుండియు భాషయున్నదని నొక్కి చెప్పవగును. అయ్యది సాంఘికవిషయకమును, చారిత్రకమున్నై యవసరార్థముత్పన్నమయినది. భాషాశాస్త్రము సాంఘిక శాస్త్రాంతర్భాగమైయున్నది.

7 భాషా పరస్పరసంబంధశాస్త్రము నిన్నమొన్నటిదిగనున్నది. ఇదిజంతుపరస్పరావయవ నిర్మాణతత్వశాస్త్రముతప్ప తక్కినయన్యోన్య సంబంధశాస్త్రములకంటె నధికకాలమునుండి యుండియున్నను యీస్వల్పకాలములో తక్కినశాస్త్రములకంటె మున్నిందుపయోగింపఁబడిన పరిశోధనావిధానములవలనను, సంప్రాప్తఫలిత సిద్ధాంతములవలనను, యితరశాస్త్రములు పెక్కింటినభివృద్ధిగావింప విశేషముగదోడ్పడినది. ఈశబ్దతత్వశాస్త్రము పొడచూపియొక శతాబ్దమయినను పూర్తికాలేదు. దానిజననాభివృద్ధులతి శీఘ్రములగుట నదిబ్రహ్మముఖమునుండి వాగ్దేవిపొడమినట్లు తోచుచున్నది. గ్రీకు, రోమను వాగ్రియములచే నీశాస్త్రము పెంపొందియుండినను యీరెండు దేశములయందునుగూడ నీశాస్త్రముత్పత్తిగాంచియుండలేదు. ఈ శాస్త్రముదూరస్థమగు భారతదేశముచే బ్రసాదింపఁబడిన వరప్రదానముగనున్నది. ఈశాస్త్రచరిత్రమును వ్రాయుచో నలెగ్జాండ్రియాయందు నివసించెడు గ్రీకువైయాకరణులును, తత్సమానులగు హారో, ప్రిస్కియనులను రోమనువైయ్యాకరణులును, యీశాస్త్రమార్గప్రథమావలంబకులని చెప్పవలసియున్నదనుట సత్యమే. ప్లేటో మహాశయవిరచిత క్రేటిలస్సను గ్రంథము శబ్దతత్వజిజ్ఞాసువులకు కొంచెము కుతూహల జనకమగుటయు సత్యమే. మఱియుసరేబియా వాగ్మయమందు క్రీ॥ వె॥ ఏడవశతాబ్దమునుండి నేటివరకు వ్యాకరణ, నిరుక్తి, నిఘంటు, గ్రంథములను రచించినవారు రెండువేలకు మీరియుండిరనుటయు, సత్యమే. వీరిలోననేకులు పారశీకులు ఇక్లే యూదులలో క్రీ॥ వె॥ పది, పదునొకండు శతాబ్దములనుండి నసార్టిక్కు తార్కికులును, హిబ్రూ వైయ్యాకరణులును పెక్కుండిరి. కాని నారిప్రయత్నము లేకముఖ్యములగుటచే వీరియందొకఁడును యీశాస్త్రకారులు కాజాలకుండిరి. యీకృషి యితరవిషయములయందయినచో సాఫల్యమునుకొంతవఱకైనగాంచియుందును. పాశ్చాత్యలోకము సంస్కృతభాషనుగాంచ కన్నులు తెరచిననాఁడె యీశా

స్త్రీముద్భవమయ్యెను. భారతీయుల దేవభాషనుగూర్చియు, ప్రిప్రిధమమున గృషిసల్పిన మహాశయుల యుత్సాహావేశము లిప్పటికిని పాశ్చాత్యుల రక్తనాళములంజొచ్చి వారిను ద్రోకింపc జేయుచుండుటయగాక భావినిగూడననేకతరములవరకు నీదీక్షనుసంక్రమింపగలదు. మనుధర్మశాస్త్రమున మాంసశబ్దార్థనిష్పత్తినిగాంచ మనకునవ్వువచ్చును (మనుస్మృతి 5వ అధ్యాయం 55 శ్లోకము)

శ్లో॥ మాంసభక్షయితాముత్ర ♦ యస్యమాంస మిహాద్మ్యహం ♦
ఏతన్మాంం సస్యమాంసత్వం ♦ ప్రవదంతి మనీషిణః ॥

( ఎవనిమాంసమును నేనీలోకమున తినుచున్నానో వాడు నన్ను పరలోకమున తినగలcడు ) ఈకారణముచేతనే మాంసమునకు మాం-స-యని వ్యుత్పత్తియని పండితాభిప్రాయము.

దీనివలన గ్రీకులు వ్యుత్పత్తినిగూర్చి గావించిన యత్నములు మనకు స్మృతికివచ్చును డీన్‌స్విఫ్టు అను కవీంద్రుcడు 'ఓస్లరు' అను మాటకు 'ఓటుస్టీలర్' అను వ్యుత్పత్తిని హాస్యరసముగ వ్రాసియుండెను. క్రీ॥ ము॥ 5వ శతాబ్దమునందుండిన ప్రపంచమునకు ప్రథమ నిరుక్తిశాస్త్రజ్ఞుడగు యాస్కుcడను భారతీయుని మనము మిగుల కొనియాడకుండజాలము, అట్లే సంస్కృత వైయ్యాకరణ శిఖామణియను పాణిని క్రీ॥ ము॥ 300 సం॥ రములనుండి యుండెను. ఆతcడును శ్లాఘాపాత్రుcడుగనున్నాడు. అంతియకాక పాణీనీయమతావలంబకులగు కాత్యాయనాది మహావైయ్యాకరణ గ్రామణులు కూడనుతిపాత్రులు. వారికి మనకుదెలిసిన విషయములుకొన్ని తెలియకపోయినను, కొన్నిపిచ్చియూహాలు వారికున్నను, కొన్నిపొరపాటులు వారుపడినను, వానిని మనము పాటింపరాదు వీరేశాస్త్రరీతిని శబ్దమును ధాతు, ప్రాతిపది, కోపసర్గాదివిభాగములుగ విభజించిరి. గ్రీకులెన్నcడెఱుcగని భాషారహస్యములను వారే తెలిసికొనియుండిరి

8 ఇండియా, పెరిషియా, అర్మీనియా, దేశములయందలి భాషాకుటుంబములును, గ్రీకు రోమను, కెల్టు, టూటను, స్లావుల భాషాకుటుంబములును, కలియందిమిడి యుండుటచేత నార్యను యిండో జర్మానిక్, ఇండోయూరపియన్, అను సాధారణనామములచే నొప్పు ఆసియా, యూరోపు, ఖండములయందలి వివిధభాషావర్గముల పరస్పరసంబంధములను నిర్ధారణచేయుటయందు సంస్కృతమునకుగల విశేష ప్రాముఖ్యమునుగూర్చిన గానమునకు పూర్వపుపండితులు శ్రుతిప్రాయముగ నదివరకె సూచించియుండినను 1786 లో కలకత్తానగరమున సమావేశమయిన ఆశియాటిక్కు సొసయిటీయందధ్యక్షపదమునలంకరించి యాతడొసంగిన యుపన్యాస వీణాగానమందలి తంత్రీస్వనముల మూర్ఛనలిప్పటికిని ప్రపంచమంతటను శ్రవణానందముగ ప్రతిధ్వనులీనుచున్నవి. ఈయధ్యక్షకోపన్యాసము మఱిరెండు సంవత్సరములపిమ్మట బ్రకటింపబడినది.

9 ఆయుపన్యాసమున సర్ విలియంజోన్సుగారిట్లు వక్కాణించిరి. "సంస్కృతభాషాప్రాచీనత యెట్లుండనిండు, యయ్యదియత్యద్భుత సంశ్లిష్టభాషయై యలరారుచు, గ్రీకుభాషకంటె నధిక సంపూర్ణతనుగాంచి, లాటినుభాషకంటె పదసమృద్ధికలిగి యీయుభయభాషలకంటె నధికమనోహరముగ సంస్కరింపబడియున్నది. ఐనను పై రెండుభాషలకును ధాతువులందును వ్యాకరణ రూపములందును బలవత్తరసంబంధము కలిగియున్నది. ఇట్టిసంబంధము నిర్హేతుకముగ నుండనేరదు. ఈభాషాత్రయమును పరిశోధించు శబ్దశాస్త్రజ్ఞుడు, ఆమూడునునొకే మాతృభాషాసంజనితములని విశ్వసింపక తీరనంత ప్రబలముగనున్నది. ఆమాతృభాష యిప్పుడంతరించియుండును. అంతబలవత్తరహేతువుగ గన్పట్టకుండినను యిట్టిహేతువునుబట్టియే గాతిక్, కల్టిక్, భాషాద్వయమందలి వ్యాకరణమర్యాదలుభేదించియుండినను సంస్కృతముతో నేకమాతృకాజనితములగు సోదరభాషలుగ నెంచబడుచున్నవి.

10 19వ శతాబ్దారంభమున యీశాస్త్రీయదార్ధకారులకు జన్మభూమియను గౌరవమును జర్మనీదేశముపొందినది. జర్మనీనేటికి నియీశాస్త్రవిషయమునఅగ్రస్థానమునందియున్నది. నతిపాత్రమగు ఋజుభావముతో నైరోపియ భాషావర్గమందలి ప్రత్యేకభాషలకును వానితోసోదరభావమున వర్తించు నిండియాపెరిషీయా దేశభాషలకును, సామాన్యసంబంధములు చూపి పండితమార్గదర్శిత్వమును వహించినవాడు జర్మనీపండితరాజును, బహుభాషావేదియు, నిరంతర పరిశ్రమాసక్తుడునగు ఫ్రాన్సుబాప్పను మహాశయుడే. బహుసుప్, తిగంత రూపసంకులములయిన యీభాషలయందలియంత్యప్రత్యయములకును కృత్తద్ధితాది రూపములయొక్కయునుత్పత్తిక్రమమును నిరూపించుటకొరకు సిద్ధాంతమేర్పరచుటవలనగూడ నీమహాశయుడే పండితమార్గదర్శియగుచున్నాడు.

11 బాప్ మహాశయుని వేరొకనినపిమ్మటనీశాస్త్రజ్ఞులలో దెలుపవలసిన ద్వితీయ మహాశయుడు యచటివారెల్లతెలిసిగన జేకబ్ గ్రిమ్ పండితోత్తముడైయున్నాడు. శబ్దశాస్త్రజ్ఞుడైన యీమహాశయునిపేరనే మనబాల్యావస్థలయందు వినోదార్థము పఠించదగిన గ్రిమ్సు ఫెయిరీటేల్సనబడు నమానుషగాథలతోగూడిన గ్రంథమును జేకబు విలుహెల్ములను గ్రిమ్ సోదరులచేవిరచింపబడియున్నదని తెలుపుటకెంతయు నానందదాయకముగనున్నది. పయికథలలో దెలుపబడియున్న నైంద్రజాలకునిచేతి మంత్రపుబెత్తమును బోలిన యమానుషశక్తియుక్తులీ మహామహునకున్నవేమోయను భ్రమ కలుగుచున్నది. లేనిచో దేవతావేశముచేగాని గ్రహింపనవకాశము లేని విషయముల నీపండితాగ్రణి యెట్లుకనిపెట్టగలిగియుండెను? విపులమగు యిండోయూరపియను కుటుంబమునందలి జర్మానిక్ భాషలనెడు ప్రత్యేకవర్గమున్నుగూర్చియీవిద్వాంసుడుగావించిన పరిశ్రమవలన నతడు చరిత్రాత్మకవ్యాకరణ శాస్త్రనిర్మాతయయ్యెను. ఇట్లుబాప్ పండితాగ్రణి భాషాపరస్పరసంబంధశాస్త్రకారుడై

విరాజిల్లెను. గ్రిమ్ పండితుఁడు నిజనామాంకితమైనయొక్క యత్యా
దృత హల్లుపరిణామసిద్ధాంత సూత్రములను కనుగొనుటచేతఁబ్రశాస్త్రీ
యమంచపరమ్యాటను విఖ్యాతినతఁడుగాంచెను. డెన్మార్కుదేశపు పం
డితుఁడగు రేస్కును నతఁడీసూత్రవిధానము నించుకముందే సూచిం
చియుండెను. ఆయినను నిజవిజ్ఞానచాకచక్యముచే పగమాగహస్తములను
సహితముగ గ్రహించు ప్రవర్తనాశక్తి గలవాఁడగు గ్రిమ్ మహాశయు
ని నానోబలిమిచే భాషాశాస్త్రమునకెల్ల శాస్త్రములయందు ఘనత
కలిగినది.

12 భాషాశాస్త్రీయతత్త్వతత్ప్రబ్రూపనిరూపణ శాస్త్రీయమును ఆగస్టు ఫ్రీడ్రిక్ పాట్టు మహాశయుఁడు (1802-87) త్యాగించెను. ఒక్క డు కోల్లెయిరు మహాశయుఁడు శబ్దరూప నిష్పత్తిగావించునెడ స్వర వ్యంజనముల శబ్దశాస్త్రజ్ఞులు పరిగణింపకుందురని వారినపహసించెను. ఈయవమానమును తొలగింపనెంచి 19వ శతాబ్దపు పూర్వార్ధమున పాట్టు పండితుఁడితర విద్వాంసులకంటె నెక్కుడు పాటుపడెను.

13 పరిశోధనాఫలిత సమీకరణ సముచ్చయపరిణతియందు ష్లైఖరునామక మహాశయుఁడు ప్రఖ్యాతిఁ జెందెను. విస్తారభావము నదివరకేగాంచుచుండిన యీశాస్త్రము నాయన 1861లో తాను ప్రకటించిన నైఘంటిక మూలము ననఘకలరోన్నతిస్థితి నిగాపించెను ఈనిఘంటువునందు ఇండో-యూరపియను కుటుంబములో చేరిన ప్రతిభాషయొక్కయు స్వరూపనిరూపణమును, ఛాయాపటమువలె గాపించి తుదకు పృష్ఠభాగమున నాద్యమాతృక భాషా ముఖపత్రమునుగూడ రేఖామాత్రముగ సూచించియుండెను. నాముద్రాయక ఛాయాపటములందువు పలెడనియందలి ప్రతిమలనేకవిధముల నసంపూర్ణములై సంపూర్ణతుష్టికరమగు ఘూపటసారూప్యము నీయకుండెను. శాస్త్రీయసిద్ధాంతములననుసరించి కల్పింపఁబడిన యిట్టి పునర్నిర్మాణములన్నిటి నీగూర్చి ష్లైఖరు మహాశయుఁడుగావించిన తన్నిశ్చయము గా

భినవీవిషయమువిస్పష్టముకాగలదు. భాషాపరిష్కృతిశాస్త్రములలోనొ కటియను విషయమునుగూర్చి పరిష్కృతిశాస్త్రజ్ఞుఁడగు స్లీషరుగారియ భిప్రాయములు చిరకాలముక్రిందటనే యసమంజసములని నిర్ధారణ చేయఁబడినవి. భాషావిషయకములగు నతనివేదాంతి సిద్ధాంతముల లోకొన్ని హెగెలు అనువేదాంతకోవిదుని సిద్ధాంతముల ననుసరించు చున్నవని స్టైన్టుల్బర్గు మహాశయుఁడు తనయొక్క జర్మానిక్ పో ర్షంజక్ గ్రంథరాజమునందే డవసంపుటమున 360-372 పుటలలో నిస్సందేహముగ దెలిపియున్నాడు. ఈసిద్ధాంతములుగూడ పరిష్కృత మున పండితామోషదూరములైనవి. ఐనను స్లీషరు మహాశయుఁడు భాషాశాస్త్ర విజ్ఞానమున మిగులనధికుఁడని నేటికిని యెల్లరిచే నెంచ బఁడి గౌరవింపఁబడుచున్నాడు.

14 ప్రతిబుధవారమున నొకగటకాలము మాత్రముజరిగెడు సామాన్య ప్రసంగములయందు వీలగునెడల నింకను ననేకపండితవ రులీభాషాభివృద్ధి నెట్లుగావించిరో తెలుపుచుండిన బాగుగనుండును. ఆమహాపండితుల నామములకొన్నిటి నిట జేర్కొనుచున్నాడను. వారుష్లీజల్ సోదరులిరువురును బెన్ఫీయనునతఁడు సంస్కృతమునం దును కర్టియస్సనునాతఁడు గ్రీకుభాషయందును, కార్సెన్, మాంసె న్, అనువారు లాటినుభాషయందును, జయస్ అనునతఁడు కెల్టిక్కు భాషయందును, మిక్లోసిష్ యనునతఁడు స్లావిక్కుభాషయందును, డీ యజ్జనునాతఁడు రోమాన్ భాషలందును, షెరర్ అనునతఁడు జర్మా నిక్కు భాషలయందును, మిగుల పరిశ్రమగావించిరి. ఈరీతినే యి టాలియాదేశీయుఁడగు అస్కోలీపండితుఁడును, ఫ్రెంచిదేశీయులగు బర్నాఫు, బ్రీయలు, అనువారును, డెన్మార్కు దేశీయుఁడగు రేస్కు పండితుఁడును, ఆంగ్లోజర్మను జాతీయుఁడగు మాక్సుముల్లరు మహా పండితాగ్రణియు, నమెరికా దేశీయుఁడును వైయ్యాకరణియునగు వి ట్నీపండితోత్తముఁడును, సుప్రసిద్ధ జర్మనుదేశీయులగు బ్రిసలానగ రవాస్తవ్యులగు పిక్కనుపండితుఁడును, బెర్లినునగరవాసి జోహానీస్

ష్మిత్ పండితుండును లీప్‌సిక్ నగరవాసి వెస్కియన్ పండితుండును, గూడ నీభాషావిషయమున నతిపరిశ్రమల గావించిరి. గతయిరువదిసంవత్సరములనుండియు నవ్యప్రవశమున నమెరికాయందాచార్యపదవియందున్న కోల్లిడ్జియను పండితాగ్రణియు నీపరిశ్రమనధికముగ గావించెను.

15 జంగ్రిమేటికర్ లేక నవీన వైయ్యాకరణులను పేరఁబరగు లీప్‌జిగ్గునగర పండితమతమువలన 1870 మొదలు 1890 వరకు భాషాప్రపంచమున గలిగిన నవయుగముఖ్యాంశములను సంక్షేపముగ దెలుపుట కాపండితులు జేర్కొనినసూత్రములు చాలును. ఈనవీన యుగమునందీ శాస్త్రప్రచారమునకై యవలంబించఁబడిన సుప్రసిద్ధమార్గము పూర్వోక్తులగు జార్జికర్టియసువంటి మహాపండితుల యభిప్రాయములలోఁ గొన్నిటిని ఖండించుటయై యున్నది. ష్లీచరు మహాశయుని యంతేవాసియగు లెస్కియనుపండితుఁడు ప్రారంభమున తానె నాయకుఁడై యీవాగ్వాదమును నడిపించెను. ఈతఁడు ధ్వనిపరిణామ సూత్రములు సర్వదావర్తించుననుసిద్ధాంతమును తన ఖండనకు ముఖ్యవిషయముగ జేసికొనెను. ఈవాదము ఆస్తాఫ్, పాలు, కార్లబ్రగ్మన్, లను పండితయువకుల సిద్ధాంతము తేలక పూర్వపక్షరాద్ధాంతములలో నిలిచియుండెను. వారిలో బ్రగ్మన్ మహాపండితాగ్రణి విరచితమగు యిండో జర్మనిక్ భాషావ్యాకరణ ప్రబంధసంఘమును 1886లో ప్రకటించిరి. అతఁడుతన సమకాలీనులగు శబ్దశాస్త్రజ్ఞులలో నగ్రగణ్యుఁడుగ శిరసావహింపఁబడెను. ఈభారగుపండితాగ్రణులచే సృజింపఁబడిన నూతనమార్గమున కొంతభాగము గ్రాంథికభాషలతో పోల్చిచూచుచు నవీన భాషలపరిశోధనల యందవలంబించఁబడిన శాస్త్రీయమార్గాభివృద్ధితో నేకీభావమును గాంచుచున్నది. ఏలనన జీవభాషలు నిర్జీవభాషలతోపాటు పరిశోధనార్హములుగనున్నవను నావశ్యకతను క్రమేణా పండితులామోదింపసాగిరి. నూతనవైయ్యాకరణులు గ్రాంథిక భాషలనుండియొగాక

వ్యావహారిక భాషలనుండికూడనుదాహరణల నుగ్రహింపనారంభించుట
చే వారు దెలుపునదెల్ల సమగ్రమై ప్రకృతకాలోచితముగ నుండసా
గెను. ప్రకృతకాలజ్ఞానమునుబట్టి పురాతనసమస్యలలో గొన్నిటిని వి
డచియు ననమర్థులగుట నంగీకరించుచు వానినివిడిచిపెట్టుట కంగీక
రించుట, భాషా చట్టములకును యిచ్ఛానుసార పరిణామికములగు ధ్వ
నిసూత్రములకునుగల విస్పష్టభేదములను గమనించుట, భాషాస్వ
రూపనిరూపణ గావించునెడ తద్విశిష్టరూపసాంకర్యమును తప్పక గమ
నించవలెనని యెంచుట, శబ్దరూపపరిణామాభివృద్ధియందు సాదృశ్య
తకుగల ప్రాముఖ్యతను విధాయకముగ గమనించయుంచుట, యను
నవీయూనూతన వైయాకరణపద్ధతికి ముఖ్యలక్షణములుగనున్నవి.
ఈచర్చచాలవరకు జర్మనీదేశముననే జరిగినది. అచటకూర్సు జస్ట్రి
ప్ఫు బెర్ల్ బెగ్గర్సు దీటాఫ్రిజ్ మొదలగుననేక పత్రికలయందు వ్యా
సరాజములను వ్రాసియుండిన మహనీయులీ చర్చలయందేవిషయమున
నెంతవరకు పాల్గొనిరో యెట్టిపరిశోధనల గావించిరో, యిందువివరము
గదెలుప నవకాశముచాలదు. బ్రగ్మన్, స్ట్రైటు బర్గులిరువురును
సంపాదించి ప్రచురించిన యిండో జర్మనిష్ ఫోర్షంజన్ అనుగ్రం
థములయొక్క నూతనసంపుటములనుగాని, శబ్దతత్త్వశాస్త్రనవీనమా
ర్గములనుగూర్చి ఫ్రాన్సు, యింగ్లండు, యిటాలియా, డెన్మార్కు,
నార్వే, స్వీడన్, అమెరికాలలో బ్రకటితములగు పత్రికలయందు
ప్రచురితములగు యేవ్యాసములుగాని తిలకించినవారి కీనవయుగమొ
క్క ప్రస్తుతసామాన్య స్థితిగతులు విస్పష్టములుకాగలవు 1909 ఆ
గష్టులో నిండో జర్మనిక భాషాపండితపీఠమును బ్రగ్మనుగారధిష్టించి
న 25వ వార్షికోత్సవము నాయన శిష్యమిత్రబృందమున ననేకులుచే
యుచున్నారు. ఆసందర్భములో నాయనగౌరవసూచికములుగ నా
యనతోడి శబ్దతత్త్వశాస్త్రజ్ఞులు ప్రత్యేకముగ నొకసంపుటము నలంక
రింపవ్రాసిన వ్యాసరాజములను ఆయనతోకలసి మెలసిపనిచేయు
చుండిన స్ట్రైటుబర్గు మహాశయుడు సేకరించి యొకప్రత్యేకసంపుటము
గ బ్రకటింపుచున్నాడు.

16 నవీన వైయ్యాకరణోద్యమముల ముఖ్యఫలితములను వివరించుచునిపుడు దిఙ్మాత్రముగ సూచించినచారిత్రిక విషయములయందు భాషాశాస్త్రవిషయక ముఖ్యోపలబ్ధ సిద్ధాంతములయొక్క త్యావశ్యకములగు కొన్నిముఖ్యాంశములను నేను తెలుపక మానవలసివచ్చినది. విడిచిపెట్టబడిన విషయప్రాముఖ్యత యీసభాసదులకపరిచితమైయుండవచ్చును. గ్రిమ్‌సూత్రములకు విశేషప్రయోగములను క్రమేపి సమన్వయించుటకు కనిపెట్టఁబడిన నూతనవిషయపరంపరయే యందుమొదటిది. ఈయుపలబ్ధులలో నొకటిగణితశాస్త్రమందును, సంస్కృతభాషయందును నపారపాండితీవిశేష విఖ్యాతుఁడుననగు హర్మను గ్రాస్మను మహాశయునిచే, కనుగొనబడినదియే. ఆయన గ్రిమ్‌సూత్రమునకు విలక్షణములుగ గన్పట్టుననేక శబ్దరూపపరిణామములు ఇండో యూరోపియన్ మాతృకభాషయందా యాధాతువు లాద్యంతములయందు హాకారసహిత పూర్వరూపయుక్తములుగ నుండుటవలననే ఆయాపరిణామములు సిద్ధించినవని యాయనకనిపెట్టిన నూతనవిషయమైయున్నది. జర్మానిక్ భాషలయందలి ధ్వనిపరిణామతత్త్వము దాత్తానుదాత్త స్వరితాదిభేదములచే నిర్ణయింపబడుచున్నదని 1877లో డెన్మార్కు దేశపండితుఁడగు కార్లువెర్నరుకనిపెట్టిన నూతనవిషయ మనన్యసాధారణ ప్రాముఖ్యతనుగాంచియున్నది. ఏతత్సిద్ధాంతమున్ను, 1870 లో నాస్కాలియను విద్వాంసుఁడు కకారపూర్వరూపము సంయుక్తాక్షరమనిచేసిన సిద్ధాంతమున్ను - యీరెంటిను కొల్లిడ్జి మొదలగు యితరపండితులచే వివరముగ పెంపొందింపఁబడిన బ్రిగ్మను మహాశయుని ప్రసిద్ధమైనట్టియు ననాశికసిద్ధాంతముతోఁగూడి నియమరహిత ధ్వనిపరిణామరూపములు కలవనెడు ప్రాచీనాభిప్రాయము హాల్వ్విషయమున కేవలమసమంజసమని స్థిరపరచుచు, ధ్వని పరిణామసూత్రములకు విశేషవిధులు లేవను సిద్ధాంతమును తొల్లిటికంటె దృఢతరముగ స్థాపించినవి. నాటినుండింతదనుక కొన్నివివరములుదక్క హాల్వ్విషయమున ముఖ్యయోవిశేషములును చేర్పఁబడియుండలేదు.

17 తనకాలమున శబ్దశాస్త్రజ్ఞు లచ్చులను పరిగణింపలేదని వా
ట్రైరు మహాశయుండు గావించియుండిన యుపన్యాసమిప్పటికిని వర్తిం
చుచు అచ్చువిషయమున నింతదనుక భాషాతత్త్వశాస్త్రి మసగ్ర
ముగానేయున్నది. 1865 లో కర్టియసు మహాపండితుఁడు ప్రకటించి
న 'స్ప్రాక్లిగుస్ ఆలాటీను' అనుఅచ్చువిషయక గ్రంథము వెలువ
డినవెనుక జరిగిన పరిశోధనాపరంపరవలన నచ్చుప్రాముఖ్యత క్రమక్ర
మముగ గ్రాహ్యమయ్యెను. ఈపరిశోధనలుముఖ్యముగ, ఎమిలంగ్,
అస్కోలి, బ్రిగ్మను, కొల్లిట్జ్, జోహాన్సెస్, ష్మిత్ట్, హ్యూబ్షమన్, లను
పండితాగ్రణులవలన గావింపఁబడినవి ముఖ్యముగ మాష్లెబా మ
హాశయుండు 1879 లో క్లైలాంగెన్ వోకేలి ఆ, ఈ, ఓ. ఇండెర్
యూరోపేషన్ స్ప్రెషెన్, అనగా యురోపియన్ భాషలలో ఆ,
ఈ, ఓ, యను అచ్చుల పరిణామములనుగూర్చిన గ్రంథరాజము
ను విరచించియున్నాడు. మఱియును స్విట్జర్లాండు దేశపు పండితుఁడగు
ఫెర్డినాండు డీసాస్యూరే యను నతఁడు 1879 లో వ్రాసిన 'మెమ్వా
యరు సర్ లీసిస్టేం ప్రిమిటిఫ్ దె వోయల్లెస్' యనగా పూర్వమంద
లి యచ్ పరిణామ విధానమునుగూర్చిన గ్రంథమునేటికిని భాషాశా
స్త్రగ్రంథముల యందత్యుత్కృష్టమై యలరుచున్నది. ఆయుగప్ర
భృతి యిండో యూరపియన్ అచ్ విషయక సిద్ధాంతమునకు ముఖ్య
మైన సహకారోపన్యాసములు బర్తొలోమే, బెచ్టెల్, ఫార్ట్యునే
టోవ్, మెలెట్టి, బ్రిగ్మన్, స్ట్రీటుబర్గు మహాశయులచే గావింపఁబడి
నవి. ఇందుముఖ్యముగను దాత్వావ స్వరభేదములగూర్చియు, త
త్సంబంధమగు అచ్ పరిణామమునుగూర్చియు నింటో జర్మానుషర్
ఎగ్జంటు, యనుగ్రంథమును 1895 లోను, ఇండో జర్మానిషర్ అబ్లా
ట్ అనుగ్రంథమును 1900ల లోను, హెర్మను హర్ట్ మహాశయుఁడు
రచించియుండెను. అచ్ పరిణామమునుగూర్చియు, స్వరభేదమునుగూ
ర్చియు, నింకను తెలియవలసిన విషయములు పెక్కులుగలవు. ఈ
విషయములనుగూర్చి యింకను పరిశోధనలను గావించినయెడల నవి
ఫలప్రదములు కాగలవు.

18 ధ్వనిపరీక్షయు శిక్షాసూత్రములు ప్రవృత్తినిఁగూర్చిన చర్చ వలన గతశతాబ్ద చరమార్థమున విశేషాభివృద్ధిగాంచిన శబ్దశాస్త్ర శాఖాంతరమగు శిక్షా ప్రసంగము మార్గదర్శకమైనది. ఇదియొక నవీనశాస్త్రముకాదు. ఏలనన, సర్వశాస్త్రవేత్తలగు భారతీయలాక్షణికులు రెండువేలేండ్లకుమున్నే యత్యంతస్పష్టముగ స్వరవివేచనగావించి నేఁటి పండితోత్తములకుగూడ సత్యాశ్చర్యమును గూర్చుచున్నారు. కాని పాశ్చాత్యదేశములందు గతశతాబ్ద మధ్యవరకును శిక్షాశాస్త్రముగ పరిగణింపఁబడియుండలేదు. పాట్సు, బెప్పి పండితుల ప్రాచీనులకు శబ్దశాస్త్రజ్ఞులచే ప్రప్రథమమున మార్గమేర్పరచబడెను. స్వరసూత్రములత్యద్భుత సంక్షిప్తముగ మిగులనాడంబరముతో నిర్మితమైనవి. తుదమొదలు గన్పించని యీమహాసందిగ్ధ వ్యాక్తమునుండి నియమసహిత వ్యక్తశిక్షాశాస్త్రమేర్పరచఁబడినది. స్వరపరిణామము విధిరహితమై యనిర్వ్యాగోచరముగా కవిధివిహితనియమానుసారిమైయుండెను. ధ్వనిస్వభావమునుగూర్చియు, తదుత్పత్తినిగూర్చియు, తదుత్పత్తిస్థానములనుగూర్చియు, విశిష్టపరిశోధనల కవకాశముండెను. ఇదె శిక్షాశాస్త్ర ప్రయోజనము. భాషాతత్త్వశాస్త్రమందీశాఖ నభివృద్ధిచేయుటయందు నవీనభావలు విశేషముగ పాల్గొనినవి.

19 ప్రకృతిశాస్త్రజ్ఞులును, అవయవతత్త్వశాస్త్రజ్ఞులును, భాషాతత్త్వవేత్తలతో సహకారులై పాటుపడి యీపరిశోధనల నభివృద్ధిగావించిరి. ఈవిషయమున బ్రిక్కీ, మర్కెల్, డాండర్సు, హెల్మ్సు, హెబార్డిమెల్లీస్, ఇవాన్సు, ట్రాటుమస్, టెక్మర్, స్వీట్, సీవర్సు, మీలెట్, రూసలాట్టు, యనువారును, అమెరికాయందలి బెల్, స్క్రిప్చరులనువారును యితరులకంటె నధికముగ పరిశ్రమయొనర్చి విఖ్యాతిగాంచిరి ధ్వన్యుత్పత్తి స్థానములగు కంఠతాల్వాద్యవయవచ్ఛేదనతత్త్వవేత్తలచే పరీక్షింపఁబడి స్వరములకును వానియుత్పత్తిస్థానములకునుగల యన్యోన్యసంబంధమును యవయవతంత్రమును గూర్చి

యు, రాను రానునిర్దిష్టముగ వ్యక్తీకరింపబడుచున్నది. కృత్రిమతా
లువు మొదలగు నితర యంత్రసాధనములను కుశాగ్రబుద్ధులతో
నిర్మించి తదుపయోగమువలన ప్రతిస్వరమును ఉచ్చరించుటయందు
జిహ్వాపొందుస్థానములను గుర్తించుట కవకాశములనేకములు కల్పిం
చఁబడినవి. ఉచ్చారితధ్వన్యుత్పత్తి స్థానపరిశోధకులీ యంత్రములనిపు
డు సర్వసాధారణముగ నుపయోగించుచున్నారు. శ్రవణగతధ్వని
శాస్త్రవిషయమున స్వరపరీక్షారూపమగు పరిశోధనలు గావింపఁబడి
నవి. ఈపరిశోధనలయందు ముఖ్యముగ ఇ, డబ్లియు, స్క్రిప్చరను
అమెరికాదేశపు శబ్దలాక్షణికుఁడుగావించిన యుచ్చారితధ్వని వక్రరే
ఖాపరిశీలనము ప్రశంసార్హముగానున్నది. భాషాతత్వశాస్త్ర విష
యకమైన యీమహాసీయని గ్రంథరాజము వాషింగ్టను నగరమం
దలి కార్నీజీస్మారక సంఘమువారిచే ప్రచురింపఁబడినది. ఉచ్చారిత
ధ్వనిసంజనిత నాదములను వంకరగీతలుగ సూక్ష్మనిర్మితసాధన స
హాయ్యమున దృగ్గోచరమగు పటరూపములు చిత్రితములయినవి.
ఈనాదములిప్పటి సాధనసంపత్తి ననుసరించి విస్పష్టముగ ప్రమాణ
ముగావించియు బ్యాందుకాలమానాంశలుగ పరివర్తింపఁబడినవి. ఈ
పరివర్తన ఫలితములు ప్రకృతిశాస్త్రజ్ఞులకును. శారీరశాస్త్రజ్ఞులకును
మిగుల నానరిద దాయకములుగనున్నవి. ఇట్టిపరిశోధనలగావించుచు
కొలంబియాలోనుండు నామిత్రుఁడును, సహాధ్యాయియునగు హాల
ల్ పండితుఁడు పైవిషయముయొక్క సత్యమును నాతోముచ్చటిం
చియుండెను. ఈపరిశోధనా ఫలితములను శబ్దశాస్త్రజ్ఞులింకను పూ
ర్ణముగ నుపయోగించి యుండలేదు కానివాని ప్రాముఖ్యత యథా
ర్థముగ నంగీకరింపఁబడియున్నది. ఈపరిశోధనా మార్గమునలభ్యమ
గు ఫలితములు సర్వసాధారణములైన పిమ్మట, ననగా 10-15 ఏం
డ్లలోపల ప్రాయశః ఏతన్మార్గమున పరిశోధనమిగుల వృద్ధిగాంచగ
లదని మనము చెప్పవచ్చును. వివిధభాషలందు శిక్షావిషయక ప్రత్యే
క మాసపత్రికల సంఖ్యావృద్ధియగుటనుబట్టి యీశాస్త్రజ్ఞానము న
ర్వతోముఖముగ విపులముకాగలదని మనము గ్రహించవలసియున్న

ది. శిక్షావిషయక పరిశ్రమయందొక భాగము ధ్వనిపరిణామసూ
త్రముల నింగ్లీషు భాషకువర్తింపజేసి యాభాషాగుణితమును క్లుప్తప
రచుటకు విశేషోద్రేకము కలదిగనున్నదని తెల్పుచు ప్రస్తుతాంశ
మును విరమించుచున్నాను సంక్షిప్తగుణితము నేర్పరచుటకు ప్రత్యే
కముగ సంఘమేర్పడినది ఈస్థాపనము విశేషలాభము కలుగునని నా
యాశయము.

20 భాషభావప్రకాశ సాధనమను ప్రత్యేకవిషయమున పూ
ర్వకాలపు హార్డర్, లాజరస్, గ్రిగర్, మొదలగు పండితాభిప్రాయ
ములంగీకృతములై, భాషాతత్త్వవిషయక మానసిక శాస్త్రజ్ఞానసం
పాదనకు మార్గముచూపెననగా స్టీన్ తాల్ పండితుని యభిప్రాయ
ములు ఖండింపఁబడి 'వుండుటు' పండితునిసిద్ధాంతములు శాస్త్రసమ్మ
తములాయెను. 1900 లలో వోల్కరు సైకాలజీయను గ్రంథమును
వుండుటుపండితుడు ప్రకటించెను. భాషానుగుణముగ వివిధజనమా
నసిక తత్త్వనిర్ణయమునుగావించు పరిశోధనాపూరితమయి యీ
గ్రంథరాజ మలరారుచున్నది. 1904 లో సెయింటులూయీ నగ
రమున శాస్త్రకళాకోవిద మహాజనసభలో భాషావ్యాకరణ పరస్ప
ర సంబంధసంబద్ధ విషయములనుగూర్చి అమెరికాఖండమందలి సు
ప్రసిద్ధ భాషాతత్త్వవేత్తలలో నగ్రగణ్యుఁడగు బల్ మహాశయుఁడిట్లు
తి చమత్కారముగ నుడివియున్నాడు. "గతయేబదియేండ్లలోను జరు
గుచుండెడి భాషాజిజ్ఞాసయొక్క ముఖ్యలక్షణము భాషయందుమా
నసిక తత్త్వవిషయములనుగూర్చి మిగుల శ్రద్ధవహించుటయే యని
యును, ఇప్పటివలె మరియెన్నఁడును భాషాశాస్త్రమునకును మాన
సిక శాస్త్రమునకును, పరస్పరసంబంధ మత్యంత సన్నిహితముగనుండ
లేదనియును" బల్ పండితుఁడు తెలిపెను. వివిధభాషలకారకములం
దు గలభేదములను పరిశీలించుటయందు జూపఁబడిన శ్రద్ధవలనను,
భావవైఖరుల ప్రకాశింపఁజేయు శబ్దజాలము విషయమగు విశేష ప్ర
యత్నమువలనను, శబ్దార్థపరిణామక్రమ సూచకమగు ప్రత్యయ,

ప్రయోగతత్త్వపరిశీలన వలనను సాదృశ్యసందర్శనోపలబ్ధ జ్ఞానవిషయ
ముల నుబట్టి కల్గినశబ్దార్థవ్యాప్తి వలనను పైవిషయము తెల్లమగు
చున్నది. అంతేకాదు, భాషావ్యవస్థావ్యవస్థల దశలనుగూర్చియు,
భాషావిషయక సంక్షోభములను, వికృతులనుగూర్చియు, శబ్దశా
స్త్రజ్ఞులిప్పుడు తీవ్రపరిశోధనల గావించుచున్నారు. ప్రస్ఫుటవాగు
చ్చారణా సమగ్రతవలన జనించినదోషరూపమగు నత్తి మొదలగు
యుచ్చారణదోషములును, 'వంకాయ పిచ్చికొండ' అనురీతిమాట
లతడబాటు, శబ్దార్థగ్రహణా సమర్థతవలన జనించు నపశబ్దప్రయో
గదోషమున్ను,- చక్షుశ్శ్రోత్రేంద్రియ లోపముచేగలిగిన యపశ
బ్దార్థ సంగ్రహణదోషమున్ను, ప్రయుక్త పదవర్జనాదిదోషమున్ను-
మానసిక శాస్త్ర పరిశోధనావిధానములందు, ఇప్పటిశబ్దశాస్త్రజ్ఞులీ వి
కృతులన్నిటిని తీవ్రముగ శోధించుచున్నారు. ఈవిధముగ మనుజుని
మెదడునందు వాక్కేంద్రస్థానముల నిర్దిష్టముగావించుటయందు
ను, భాషావిషయమై మస్తిష్కమునకుగల ప్రవృత్తిని నిర్ణయించు
టయందును, విశేషకృషి చేయబడుచున్నది.

**21** భాషలోకమందలి మనుష్యజాతికంతకు సామాన్యలక్షణ
మని యిదివరకే తెలిపియుంటిమి. సజీవమానవజాతియొద్దియును, భా
షాప్రయోగరహితముగా నుండనేరదు. ఈహేతువుచే వివిధభా
షలసంఖ్య వేలకుమీరియున్నది. ఫ్రిడరిక్ మ్యూలరువ్రాసిన యెల్ల
భాషల నామములుగల గండ్రిస్ డెర్ స్ప్రాచ్, విస్సెన్ శాఫ్టుఅను
1876 మొదలు 1887 లోపల ప్రకటించిన గ్రంథమునుజూచిన యె
డల నీసంగతివిస్పష్టమగును ఈభాషానామావళికి సంకుచిత శాస్త్రీయప
రిభాషాగోచరార్థమునగాని సామాన్య విపులార్థమునగాని గ్రహిం
పనగు భాషావిశిష్టరూపములను చేర్చునెడ నీసంఖ్య పదిరెట్లధికమగు
ను. ప్రపంచమునననేక భాషలు నానావిధములుగ నుండుటచే వా
నివర్గవివేచన సమస్యమిగుల క్లిష్టముగనున్నది. ఇదివరకు పూర్ణతృప్తి
కరమగు వర్గవిన్యాసము గావింపబడియుండలేదు. కానిసహాయాప

రసంబంధానుసరణముగను, భాషాకుటుంబములుగను నేర్పరచబడిన భాషావిభాగము లనుభవోచితములుగనున్నవి. కాని శబ్దశాస్త్రజ్ఞులును, మానుషతత్త్వశాస్త్రజ్ఞులును కపాలనిర్మాణ తత్త్వశాస్త్రజ్ఞులును భాషాసంబంధముండినను జాతిసంబంధముండక పోవచ్చుననియు, తత్కారణముచే వివిధజనుల రక్తసంబంధమునకు భాషాసామ్యము హేతువు కానేరదనియు, వారెల్లరేకగ్రీవముగ నంగీకరించియుండిరి. భాషాకుటుంబ విభేదము చిరకాలమునుండి పండితామోదమును బడసియున్నది. ఇట్టిసుకరవిభాగము విశ్వసనీయమని నాకుదోచదు. కాని యిదియనుల్లంఘనీయవిధియని మాత్రమెన్నడును భావింపరాదు.

22. భాషాతత్త్వశాస్త్రప్రచారవిషయమున మనజీవితకాలములో సంభవించిన గొప్పపరిణామాభివృద్ధులేమనగా, గ్రాంథికభాషలతోపాటు నవీనభాషలుగూడ సమానగౌరవ పదవినిగాంచుటయు, అశియాఖండమందలి భాషలు మొదలగు యితరభాషావర్గములను గ్రాంథికభాషలతో తుల్యముగ విద్యావిధానములయందు పఠనీయములుగ నేర్పాటుచేయుటయునై యున్నది. శాస్త్రప్రచార విషయమిట్లు విపులముగావించబడెను. సంస్కృతభాష ప్రప్రథమమున మనకువిదితమైనప్పుడనే భాషాశాస్త్రపఠనవిషయమున నదిచూపిన ప్రభావమునుగూర్చి యిదివరకే సమగ్రముగ జెల్పితిమి. బైబిలను క్రైస్తవమతగ్రంథము శాస్త్రార్థముచేయ నుపకరించునని యెంచి మతపాఠశాలలయందును కళాశాలలయందునుగూడ సెమిటిక్ భాషావర్గమున జేరినయింకొకటియగు హిబ్రూభాష పఠనీయముగ నప్పుడప్పుడు ఆమోదమును బడయుచున్నది. ప్రాగ్దేశలభ్య నూతనపరికర సంగ్రహమువలన అస్సీరియన్, బాబిలోనియన్ సిరియ అరాబిక్, మొదలగు యితర సెమిటిక్ భాషల తత్త్వపరిశోధన మిగులవృద్ధిపొంది సెమిటిక్ భాషాతత్త్వజ్ఞానము క్రమాభివృద్ధిగాంచినది. సెమిటిక్ భాషాతత్త్వజ్ఞ[illegible] కై

శవాపస్థయుండుండినన, డిసాసి, గెనిసియాస్, ఇవాల్డు, డిలిష్ రైటు లగార్డ్, నోల్డెకేలను మహాశయులొనర్చిన ప్రథమపరిశ్రమము హాపు, జిమ్మెరన్, బార్తు, మొదలగు పండితులనేకులు వ్యాప్తి జేసిరి. బ్రాక్లెమ్యను మహాశయువిరచితమగు గ్రుండిస్ డెర్ వెర్గ్ లైంచెన్డే, గ్రామెటిక్ డెర్ సెమిటిషెన్ స్ప్రాకెన్ యను సెమిటిక్ భాషావ్యాకరణ పరస్పరసంబంధమును తెలుపుగ్రంథ రాజమొండిప్పుడు లీప్ జిగ్ నగరమున బ్రచురింపబడుచున్నది. ఈజిప్టు దేశమునందు ప్రాచీన శాసనాన్వేషణార్థము భూమిని త్రవ్వించు యింగ్లీషు, ఫ్రెంచి, జర్మను మహాశయులు కనుగొనిన ప్రాచీనయూధ లిఖితములు భాషాతత్వశాస్త్రి వ్యాసంగమునకు ముఖ్యావసరములు కాగలవు. ఇంతేగాక యెజ్రా, నెహెమియాయను నియమిత కాలములలో బైబిలు చరిత్రవ్రాయుటకుగూడ నవియుపయుక్తములుగ నుండగలవు. ఏలనన డెరయాస్ నోఖస్సను పారశీక చక్రవర్తి కాలమున జరూసలేము నగరపరిపాలకుడగు పారశీకుడగు బెగోవాసు అనసతనికి యెహోవా దేవాలయార్చకులు పంపుకొన్న యర్జీనొకదానిని యితర లిఖితములతోపాటు ప్రదర్శపరచియుంచిరి. ఈపురాతన లిఖితములప్పటి యూధపారశీకులకుగల పరస్పరసంబంధమునుగూర్చి వ్యక్తపరచి మనకు జ్ఞానాభివృద్ధిని కలుగజేయుచున్నవి. చిన్నాశియాలో నొకవిధమయిన శిలాన్వేషణము గావించువానిలో కొన్నిటియందు చెక్కబడిన యిండియన్ యురేనియన్ నామములను విన్క్లరుగారుకనిపెట్టిరి అందువలననొక నవయుగారంభము కాగలదు. ఆర్య, సెమిటిక్, భాషాకుటుంబములకుగల పరస్పరసంబంధమును నిరూపించుటకు పూర్వలాక్షణికులొనర్చిన ప్రయత్నములు నేటికిని శబ్దతత్వశాస్త్రజ్ఞుల హృదయాకర్షణము గావించుచునేయున్నవి. ఈవిధమయిన నూతనప్రయత్నమును డెడర్సనను పండితోత్తముడు యిండో ఐరోపానిష్ ఫోర్షుంజన్ అను పత్రికయొక్క యీమాససంపుటమునందొక యుపన్యాసముగావించియున్నారు.

**23** సుప్రసిద్ధమగు రొసెట్టాశిలాశాసనము లభించినదాదిగ నాఫ్రికాఖండమందలి భాషలలో నైగుప్తీయభాషముఖ్యముగ నేటికిని బరిశోధింపఁబడుచున్నది. ఛాంపోలియన్, లెప్సియన్, డిగూజ్, బ్రిగ్షు, ఎబర్సు, మేస్పరో, పీహిల్, గ్రిండస్సెట్రీ, మొదలగు పరిశోధకుల నామములకు లీడ్సునగరవాసియు, నైగుప్తీయభాషా విజ్ఞాన ప్రఖ్యాతుఁడును, ఏతద్భాషాపరిశోధనమున చరిత్రాత్మక విమర్శనామార్గదర్శియునగు ఇర్మన్ మహాశయుని పేరున్ను, ఫీనిసను కరించిన యమెరికాలోని షికాగోవాస్తవ్యుఁడగు బ్రెస్టెడ్ పండితుని పేరున్న ఫిలడెల్ఫియా నగరవాసియగు విల్లియమ్మాక్సుముల్లరుపండితుని పేరున్న చేర్చఁదగియున్నవి. కాప్టిక్కు భాషాపరిశోధనయందు జర్మనీదేశీయులగు ష్టైన్ను, ష్టిండార్ఫును యిరువుర పేర్కొనవలసియున్నది. ఇతరాఫ్రికాభాషల సత్రిశోధనతో బరికించువారిలో ముఖ్యులగు లీనిష్ బ్లీకు, ష్టైంతాల్, క్రిస్ట, కోయల్ను, టారింసులను పండితనామములుగూడ పేర్కొనవలసియున్నది. కానియీవిషయమున సంపూర్ణఫలితములనందుటకు యింకనధికముగ కృషిగావింపవలసియున్నది. అనేకములగు విశ్వవిద్యాలయముల నైగుప్తీయభాషాపీఠములందు స్థాపించియున్నను, యింకను యితర విశ్వవిద్యాలయములు గూడనిట్లి యుట్టిపీఠముల నెలకొల్పవలసియున్నది. అట్లునెలకొల్పుటయెగాక భూమధ్యసముద్రమునకును గుడ్ హోపగ్రమునకును మధ్యప్రదేశములోనున్న వివిధభాషల పరిశోధనార్థము సౌకర్యముల నేర్పరచవలసియున్నది. 1887 లో జీట్సు క్రిప్టు ఫ్యూరు ఆఫ్రికానిష్ (ప్రెషెన్ అను పత్రిక ప్రత్యేకముగ ఆఫ్రికాభాషాపరిశోధనలకై వెలువడినది. ఇది 1895 లో బెర్లిన్నగరమందలి సీడెల్ పండితునిచే మహాసముద్రాంతర ద్వీపభాషల పరిశోధనల పత్రికతో జేర్చబడినది.

**24** దూరదేశమందలి భాషాపరిశోధనలకు సౌకర్యములంత సులభముగ లభ్యముకాజాలవని, యెంచియుండు నెడల చైనాదేశమున

ఈభాషాశాస్త్ర పరిశోధనవిషయమున మిక్కిలి యాదరణము చూ
పఁబడెనని సులభముగ గ్రహింపనగును. చీనాభాషయందు పరిశ్రమ
గావించినవారిలో ముఖ్యులు స్టానిస్, లాస్, జూలియస్, విలియ
మ్సు, లెగ్గీష్లెజల్, గైల్సు, జార్జివాండెర్ గాబలెంజ్, షివలెస్, హ
ర్త్ మొదలగువారు ఐరోపా, అమెరికా ఖండములయందలి విశ్వవి
ద్యాలయములలో చైనాభాష ఆశియాఖండమందలి యితరభాషల
కు తీసిపోవునది కాదని వానితో సమానపదవి నొసఁగబడుచున్నది.
జపాన్, కొరియా, టిబెట్టు, తురుష్కస్థానము, ఉత్తరమధ్య ఆసియా
లు, మున్నగు దేశభాషలును, సుమేరో, అకేడియన్, హిట్టైటులను
యిప్పుడంతరించిన భాషాద్వయమున్ను మరియు మెక్సికో, దక్షిణ అ
మెరికాభాషలున్ను ప్రత్యేకముగ పరిశోధకులు పరిశీలించుచున్నారు.
వీరిపరిశ్రమకై తమజీవితమునంతను ధారపోసి లభించినఫలితములను
వ్యోమమార్గధూమశకటాది సాధనమూలమున నొండొరులకు వెలుపు
చు సర్వజనసమానానుభవ యోగ్యములుగ గావించి ప్రఖ్యాతిగాం
చుచున్నారు పోలినీషియను భాషాపరిశోధనలుకూడ నిక్లేజరుగుచున్న
వి. మహాసముద్రాంతర్గతద్వీప భాషలనుగూర్చి పరిశోధనలుకూడ
చక్కగ జరుగుచున్నవి. మనీలాయుద్ధానంతరమున ఫిలిప్పయిన్ ద్వీ
పగణమమెరికా సంయుక్తరాష్ట్రములకు చేరియుండెను గాన అమెరి
కావారాభాషలనుగూర్చి యుదాసీనులుగనుండరాదు. గనుక నేఫలి
పైన్ భాషావిశేషములనుగూర్చి దూరదేశభాషలని విసర్జింపక స
న్నిహితభాషలట్లాదరించి బ్లేకు, కోసంటు, మొదలగు పండితోత్త
ములు 1898 నుండియుఁగసుదీక్షతో కృషిచేయుచున్నారు.

25 అమెరికానుగూర్చి ముచ్చటించునపుడు అందలి యిండియ
నుల భాషలనుగూర్చి చూపఁబడు శ్రద్ధావిషయములనుగూర్చి తెలు
పవలసియున్నది గెల్లాటిన్, బ్రింటన్, గాషెట్, క్లీస్మిట్, డార్సీలను
పండితాగ్రణులచే దినదినాభివృద్ధిగాంచుచున్న యిండియన్ భాషా ప
రిశోధనాభిలాష వర్ణనాతీతముగనున్నది. నూతనప్రపంచమందలి భా

షాపరిశోధన భాషాతత్వశాస్త్రమందొక ప్రత్యేకశాఖగా నెంచఁబ
యమెరికా యూరపుఖండములు రెంటిలో ననేకవిద్యాపీఠములవా
చే గౌరవింపఁబడుచున్నది. వాషింగ్టననగరమందలి కపాలశాస్త్ర
సంఘమువారిచే నిర్మాణమగుచున్నదని ప్రకటింపఁబడుచున్న, ఉ
క్రోకుత్తరమందలి యమెరికాఖండపుయిండియనుల భాషామంజరి
(Hand book of the Languages of the American Indian
North of Mexico) యనుపొత్తము కొన్నివత్సరములలో వెలు
డునున్నది.

26 భాషాశాస్త్రమునకును యితరశాస్త్రపరిశోధనలకునుగల
యన్యోన్యసంబంధము విపులముగ నీవిషయమునుగూర్చియు చెప్ప
బడకుండినను యీవ్యాసమున ననేకమార్గములు సూచింపఁబడియుండె
ను. వ్యవధిచాలనందున యీమార్గమునందు పరిశోధనలుపొందిన
యభివృద్ధినిగూర్చి ప్రస్తుతము పరిశోధనలయందలి గుణదోషనమ
స్యలనుగూర్చి యింకెంతచెప్పదను. వివిధభాషావాక్యవిన్యాస పర
స్పరసంబంధమునుగూర్చి ప్రకృతమతిశ్రద్ధతో పాటుపడుచు, దాని
భాషాశాస్త్రమందొక ప్రత్యేకశాఖగా నేర్పరచియుండిరి. ఈశాఖ
యందు బ్రగ్మన్ మహాశయుని సహాధ్యాయియగు డెల్బ్రిక్ మహాశ
యుడనేక పండితోత్తముల సహాయ్యమునుపొందుచు సుప్రఖ్యాతిని
గాంచియున్నాడు.

27 వెస్టుపాల్ మహాశయునికాలమునుండి నేటిదనుక వివిధభా
షాఛందోభాగ సంబంధములనుగూర్చినకొన్ని ప్రత్యేకమార్గముల
యందలి పరిశోధనలు జరుగుచనేయున్నవి. జర్మనీదేశపునీవర్సు పం
డితాగ్రిణిట్యూటానిక్ భాషల ఛందోభాగములనేగాక సంస్కృతభా
షయందు వేదముల,యందలి మంత్రముల ఛందస్సులనుగూర్చి యు
తివివరముగ పరిశోధించి హీబ్రూ పద్యరచననుగూర్చికూడ విశేష
పరిశ్రమ గావించియున్నాడు. అనేకవిషయములలో నసాధారణ

పాండిత్య ధురీణుండగు నీసండి తౌగ్ని శివలన గద్యరచనా సిద్ధాంతము లగొన్నిటెనిగూడ వినగలము.

28 వివిధభాషలయందలి శబ్దాదార సంబంధమును గూర్చి చేసిన పరిశ్రమ యీభాషాతత్వశాస్త్రమందొక శాఖగానేర్పడినది. ఇదియే నిఘంటువుల యందత్యావశ్యకముగనున్నది. ఈశాఖయందు ప్రాచ్య దేశపు విద్వాంసుడగు బ్రియలు మహాశయుడగ్రేసరుడై యున్నాడు.

29 భాషాతత్వశాస్త్రముయొక్క కొన్నిరూపములును, తన్మూలమున లభ్యములగు కొన్ని ఫలితములును, పురాణగాథాపరిశోధకులను కపాలశాస్త్రజ్ఞులకును, మనుష్యతత్వశాస్త్రజ్ఞులకును, సంఘతత్వశాస్త్రవేదులకును, మతపరస్పర శాస్త్రసంబంధ శాస్త్రప్రవీణులకును, అవసరమనియును, పరిచితులనియును యిదివరకేసూచించియుంటిని, రియలెక్సికాన్ డెర్ యిండో జర్మానిషన్ ఆల్టరు తమ్సు కుండీయను వింతనామముతో 1901 లో బ్రకటింపబడియున్నది, యిండో జర్మానిక్ చరిత్రకు పూర్వముండెడు ప్రాచీనవిషయముల గూర్చియు, నైరోపాఖండమంచలి ప్రప్రథమ నాగరికతను గూర్చి, యుపాధ్రడరు పండితోత్తముడుగావించిన పరిశోధనలు అమూల్యములుగనున్నవి. హార్టుపండితు విరచితమగుడై యిండోజర్మానిషస్ అనుగ్రంథము రెండుసంపుటములుగా 1905-7 లలో బ్రచురింపబడియున్నది. ఇండో జర్మానిష్ ఫోర్షంజస్‌లో డోక్టరు అండుసార్షనను విషయమునుగూర్చి మెరింజరుపండితుని వ్యాసములు ప్రచురింపబడినవి. ఈరెండునుగూడ షాక్షరుగారి గ్రంథముతో తుల్యముగనున్నవి. ఆశియా ఖండమందలి పెంపుడుజంతువులకును, మొక్కలకున్ను, యూరోపుఖండమందలి వానితోపరస్పర సంబంధమును తెలియజేయుచు నలువదియేండ్లక్రితము క్లటరుప్లాంజస్ అండు హాస్టియరీయనుపేరున విక్టరుహేన్ గారు రచించినగ్రంథము తదప్రచనమందలి

పరిశోధనరీతులనుబట్టియే యిప్పటికిని ప్రమాణగ్రంథముగనున్నది. కావుననేయారీతులననుసరించి విరచింపబడి, భాషాతత్వసిద్ధాంతము లననుసరించి విస్పష్టముగ వ్రాయబడి 1915 లో బ్రచురింపబడిన మేస్‌హాల్టుగారి వాల్టు అండు ఫిల్టు కుల్టియను గ్రంథమునకును, హాలాఫ పలడీతుని వాల్డుబామీ అండుకిల్టురు ప్లాంజస యిండజర్మానిషర్ ఆల్టుటుటలయను గ్రంథమునకును సమానాధిక్యత నీయవలసియున్నది. ఇంకను అడంబ్రల్టుకూర్ గారి హీరబ్లెక్ ఫలడెస్, ప్యూయుర్స్ (1857) డీగ్‌బన్ నేటీస్‌గారి జంతుపురాణగాథలను జూఅలజికల్ మైథాలజీ డీస్లాంటిస్ అనునృతుపురాణగాథలున, (1878-82) మొదలగుననేక గ్రంథరాజములను తత్కాలికముగ జెర్కొనవచ్చునుగాని యిపుడు విరమించుచున్నాను.

80 యిండోజర్మానిక్ జనుల యాదినివాసమెద్ది? యనుప్రశ్న చరిత్రపరిశోధనలకును, భాషాతత్వశాస్త్రమునకును నత్యంతసంబంధము కలదిగనున్నది. ఆర్యజాతి కాదినివాసస్థానమనెడు గౌరవమునుపొందుట కాశియాఖండమునకు హక్కుచాలదని, భాషాతత్వకోవిదులకు చిరకాలమునుండి తెలిసినగు విషయముగనున్నది. పిన్మార్టుస్వీడను మొదలు కాకసనకొండలవరకుండిన యూరోపాఖండమందలి వివిధదేశములు గౌరవమునుపొందుటకు పండితముఖమున వాదప్రతివాదములు జరుపుచున్నవి. ఐరోపా యుత్తరభాగమార్యుల యాదిమనివాసమను విషయము ప్రకృతమున బహుజనాంగీకృతమయి యొప్పుచున్నది. 1902 లో వెలువడిన డైహిమెట్టుడర్ యిండోజర్మనర్ అన గ్రంథమున నీవిషయమునుగూర్చి నవీనముగ ప్రకటింపబడియున్నది. మఱియు 1905-07 లలో బ్రకటితమైన డైయిండో జర్మానర్ అనుగ్రంథమునుకూడనది ప్రకటింపబడినది. బాల్టిక్‌సముద్రపశ్చిమతీరమందుగాని యైరోపాయుత్తరమందలి పల్లపు నేలలయందుగాని అనగానిప్పటిజర్మనీసామ్రాజ్యమునందుఆర్యప్రథమనివాసముండియుండినదని యీరెండుపొత్తములు దెలుపుచున్నవి.

31 భాషాకుటుంబాన్యోన్య సంబంధములనుగూర్చి సేమిటిక్ భాషలను హిందూయూరొపియన్ భాషలతో కలపి చెప్పినపుడు ప్రసంగించియుంటిని ఈసమస్య యింకను విడలేదు. దీనిపరిశోధనవలన పూర్వముకంటె నిప్పుడధిక ఫలితములెవ్వియు లభించియుండలేదు. 1900 లలో నాంగ్లేయపండితవరుడగు స్వీటుదొరగారిచే బ్రకటితమైన భాషాచరిత్ర బాలబోధిని (Primer on the History of language) యందార్యభాషలకు బాహ్యరూపమున సంబంధరహితముగ గన్పట్టెడు ఉగ్రియన్ ఊరల్, ఆల్టేయిక్, భాషలతోనున్న కల్పితమైన సుమేరియన్ భాషతోడను సంబంధముకలిగియున్నట్లు సూచించెను. దీనిపరిశోధనాభారము పండితులతలల నామహాశయుఁడు మోపెను. తనయీనవీన సిద్ధాంతమును పండితులుహర్షింపక తమ పూర్వపక్షఖడ్గములచే తీవ్రముగ వానిని ఖండింతురని స్వీటుమహాశయుఁడెఱుంగకపోలేదు. కావుననే భాషోత్పత్తిసమస్యలలోనిది యంతర్భాగమని ప్రారంభముననే యాయననుడివియుండెను. వివిధభాషలేపురాతన భాషోద్భవములుగనుండినను, వెవ్వేరు మాతృభాషాజనకములుగనున్నను, ఏమైననను దీనికిబాధ కలిగించనేరవు.

32 అనుద్దిష్టఫలితములను లభింపజేయునట్టియు, పరిశోధనేతర మార్గములయందు మహాఫలితముల లభింపజేయునట్టియు, నొకవిషయమునుగూర్చి యీసందర్భమున దెలుపవలసియున్నది. అదిజర్మనీ చక్రవర్తిగారి పోషణపైనిపంపఁబడిన గ్రూస్‌వీడెల్, లీకాక్,లను మహాపండితులిరువురును తురుష్కస్థాన తూర్పుభాగములలోకనుగొనిన నూతనవిషయముగనున్నది. పిషల్, యఫ్, డబ్లియు, మూలరు సియాజ్, సీయుజులింగు, మొదలగు విద్వాంసులు బెర్లినుపండితపరిషత్పత్రికయందును సేల్మనుపండితుఁడు సెంటుపీటర్సు బర్గుపత్రికయందును, ప్రచురించిన నమూనాలనుబట్టిచూడగా స్వీనుపండితుఁడిదివరకు కనుగొనినవాటితో సమముగ సైకతోద్భవములగు యీనూతనశాసనములుగూడ చిత్రశిల్పశాస్త్రములనకు, కళలకుచాలముఖ్యము

జసియుండలేదు. క్రియారూపములు విశేషోద్భవములనియు గుణావృద్ధ్యాద్యచ్ఛరిణామమువలన ప్రత్యయములేర్పడుననియు, హార్ట్జుమహాశయుఁడు (ఇండోజర్మానిష్ ఫోర్షుంజన్ 17 సంపుటమున 36-84 పుటలలో) మిగుల యుక్తియుక్తముగ వివరించియున్నాడు. కాని యితర సిద్ధాంతమందు కొంతసత్యమున్నను పరిశీలింపవలసిన భాగమింకను విశేషముగనున్నందున పండితామోదమును బడసియుండలేదు. దీనియందలికొంతయును, బాప్ పండితునిచే చేయఁబడిన సిద్ధాంతమునకొంతయును చేర్చునెడల భావిపండితులీవిషయమున నింతకుపూర్వము తెలిసియుండిన విషయములనుగూడ నెక్కుడుశ్రేష్ఠముగా గ్రహించి యిప్పుడగవ్య గోచరముగనున్న యీవిషయమును తేటతెల్లముగునట్లుచేయుదురు.

34 గత 50 సంవత్సరములలో భాషాతత్వశాస్త్రము పొందిన యభివృద్ధిని తిలకించువారందరికిని యీశాస్త్రపరిభాషగాంచిన యద్భుతపరిణామము గోచరించును. పూర్వమునగల పదాద్యుపసర్గలు, పదాంత్యోపసర్గలు' అనుపదములనుపయోగింపక యిప్పుడు (Formantia) ఫార్మంటియా లేక వృత్తులనెడి బ్రిగ్మనగారి సంకేతానుసారముగ (Formantive Elements) ఫార్మేటివ్ ఎలిమెంట్సు లేక కృత్ప్రత్యయములనెడు శబ్దముప్రయోగామోదమును బడయుచున్నది. పెర్ పెర్సనుపండితుని (Wurzal determinativa) వర్జెల్ డిటర్మినేటివా యను పదమున కపరపర్యాయమగు ధాతుప్రత్యయములు లేక ధాతునిశ్చాయకములు (Root Determinatives) రూట్ డిటర్మినేటివ్స్ అనుమాట భాషాశాస్త్రజ్ఞులకు నేమాతపదమైయున్నది. ధాతువులన్నియు నేకాక్షరములనెడు మనచిన్ననాటి సిద్ధాంతమిప్పుడంతరించినది. ప్రాతిపదికములు ద్వ్యక్షరత్ర్యక్షర యుక్తములు కూడ కావచ్చుననియిపుడంగీకరించి శాస్త్రవ్యవహారము నడుపుచున్నారు. శాస్త్రవిషయములను సాధించుచున్నారు, ఇండో యూరోపియన్ యను భాషలయందలి ఆదిశబ్దరూపములను పునర్నిర్మాణము

గావించుటవలనగదు "ఏసి" (అస్తి యనుసంస్కృత శబ్దమాతృక) యను
లేనుకొన్ని తర్కసిద్ధాంతరూపములనుగూర్చి గొప్పవాగ్వాదము జ
రగుచున్నదని యిటవరకే సూచించియుంటిని. 1904లో సెంటులూ
యీవద్ద కళాశాస్త్రాదులనుగూర్చి జరిగిన మహాపండితసభలో జీ
మెర్టలు, ఒకే అనుసంధించినట్లిద్దరుగాంచిన వాదప్రతివాదములవల్ల
పైసంగతి స్పష్టముకాగలదు. తర్కసిద్ధరూపములు పూర్వము వా
డుకలోనుండెనా? లేక అవి కేవల శబ్దరూపమాత్రములా? యనువిష
యముపై యీవాద ప్రతివాదములన్నియు నాధారపడియున్నవి.
భాషాతత్వశాస్త్ర సిద్ధాంతములనుబట్టి యూదికాలపు సాంఘికాదిస్థి
తిగతుల ననుమానించినదియెంతవరకు సమంజసమై విశ్వసనీయము
కాగలదనినుండ వివాదాంశమైయున్నది. ఈవిషయమున కొందర
పడిసిద్ధాంతములు చేయుటకు జంకి పండితులుమానివేసిరి. ఆర్యుల
నాగరికతా ప్రారంభమునందే గృహమునందైనను కూతురుపాలుపితుకు
ట యుపచారముగనుండుటచే పాలుపితుకునదియను నర్థముగల "దు
హితృ" శబ్దమునకు కుమార్తెయను నర్థము సంభవించినదని పూర్వము
వలెనిప్పుడు విధివాక్యమువలెనివ్వచన మొనర్చుటకిప్పటిపండితులుసా
హసింపకున్నారు. ఏసిద్ధాంతమునుగాని బలపర్చుటకు భాషాతత్వశా
స్త్రఫలితములు గౌణవృత్తినాశ్రయించి యుపయోగించునుగాని వా
నికి ప్రధానహేతువు కాజాలవు. మానుషతత్వశాస్త్రము, భూతత్వశా
స్త్రము, వృక్షశాస్త్రము, మొదలగుశాస్త్రములతో నేకీభవించి
వానిసిద్ధాంత సహాకారమున నిదిమానవచరిత్రయందలి ప్రథమభాగ
మును విశదపరచగలదు.

35 ఇంకొక్కవిషయమునుగూర్చి ముచ్చటించి విరమించుచు
న్నాను. ఈయుపన్యాస ప్రారంభమున భాషసర్వజన సామాన్యమని
తెల్పియుంటిని. భాషజనసామాన్యమున నందరికిని నొక్కటియున్న
దనికాదు. ప్రపంచమున నేకభాషాస్థాపన జరుగనున్నట్లు నేకాచా
రణము, ఏకభాష, ఏకలిపి, యనుమాటలు తరుచు వీనులసోకుచుం